గ్రామ వ్యవస్థ విజ్ఞాన శాస్త్ర గ్రంథమాల 1

# గ్రామ విశ్వవిద్యాలయ చిత్తు చట్టము



ర చ యి త :
కీ॥శే॥ ఉప్పులూరి వెంకటకృష్ణయ్యగారు



ప్ర చు ర ణ:
ఉప్పులూరి శ్రీరామమూర్తి
ఖద్దరు సంస్థానం : గాంధీవిలాస్
మ్యూజియం రోడ్డు - విజయవాడ - 2

మొదటి ముద్రణ : ప్రతులు 1000
1948 ఆగస్టు వెల : రు. 0-8-0



రెండవ ముద్రణ : ప్రతులు 1000 : 1995 డిశెంబరు
(గ్రంథకర్తగారి శతాబ్ది సందర్భంగా ఇది పునర్ముద్రించ బడినది.)
రెండవ ముద్రణ వెల : రు. 20/-



మూడవ ముద్రణ :
ప్రతులు 3000
సం॥ 2000 జనవరి

 {వెల : రు. 40/-

షరా: స్వావలంబకులకు రెండు చిలపల వడుకు నూలుకు ఈ పుస్తకము లభించగలదు.

కేంద్రీకరణ పద్ధతిన జాతీయ ప్రభుత్వపు యాజమాన్యమున ఉత్పత్తి కావలెను.

5) వయోజన యెన్నికలపై బలిష్టమగు ప్రభుత్వమేర్పడి ప్రత్యక్ష బంగారు ప్రమాణముతో కడిన నాణెవిధానపు ఆధారముతో ఈ నిర్మాణమును పాలించి రక్షించవలెను.

ప్రస్తుత కాలములో కేంద్రీకరణము హద్దుమీరి కాగితపు ద్రవ్యోల్బణను సహాయము చేసుకొని వుత్పత్తులలో ప్రవేశించి శాంతి జీవనమునకు హాని కలుగచేయుచున్నది. డా॥ జె.సి. కుమారప్పగారు ఫ్యాక్టరీ వుత్పత్తులను యుద్ధజనకములని, గృహ పరిశ్రమల వుత్పత్తులను శాంతి జనకములనీ నుడివిరి. శాంతినిగోరు మానవలోకము కేంద్రీకృతమయిన వుత్పత్తుల బారినుండి తప్పించుకొని, వికేంద్రీకరణ మార్గమును అవలంభించియుండవలసి యున్నది. గ్రామ విశ్వవిద్యాలయము జనులకు వికేంద్రీకరణ మార్గమున అభ్యాసము, నైపుణ్యము, విజ్ఞానము, చింతనలను గరపుటకు-యేర్పడినది.

గ్రామ విశ్వవిద్యాలయము తరపున శ్రీ ఉప్పులూరి వెంకట కృష్ణయ్యగారు యీ చిత్తు చట్టమును తయారుచేసిరి. వీరికి గ్రామ జీవితమునందు 30 సం॥ అనుభవము కలదు. వీరి యావదాస్థిని ఖద్దరు సంస్థానము అను పేరుతో ధర్మాదాయముగా జేసి నిర్గుణ (Non - Possession) ప్రతిజ్ఞను తీసుకొని వుండిరి.

గాంధిమహాత్ములును, రాష్ట్రపతి బాబూ రాజేంద్రప్రసాదు గారున్నూ, హరిజన్ సంపాదకులు శ్రీ కే.జి.మశ్రువాలాగరున్నూ, A.I.V.I.A. అధ్యక్షులు డా॥జె.సి.కుమారప్పగారు, తాలిమీసంఘ అధ్యక్షులు ఆర్యనాయకం, ఆషాదేవి మొదలుగా గల దేశప్రముఖు లెందరో శ్రీ ఉప్పలూరి వెంకటకృష్ణయ్యగారిచే స్థాపితమై నడిపింపబడుచున్న ఖద్దరు సంస్థానమును, శిక్షణ నిలయమును, గ్రామ స్వరాజ్యశిక్షణను స్వయముగా సందర్శించి పరిశీలించి ప్రశంసించియుండిరి. అందు ముఖ్యముగా 'దేశపిత' గాంధీ మహాత్ముని వీరి వస్తువినిమయ విధానము ఆకర్షించెను. శ్రీ సర్దార్ గొల్లపూడి సీతారామశాస్త్రిగారి ద్వారా ఖద్దరు సంస్థానము యొక్క నడకను గూర్చిన నివేదికలను తెప్పించుకొని పరిశీలించియుండిరి. దీనికి 'విజయవాడ పరిశోధన' అని నామకరణము చేసి విశ్వవ్యాప్తము చేసిరి. ఉప్పలూరి వెంకటకృష్ణయ్యగారికిన్నీ, మహాత్మాగాంధిగారికిన్నీ మధ్య జరిగిన గ్రామజీవితము వికేంద్రీకరణము, నాణె చలామణి, వస్తుమార్పిడి, నూలు చలామణి మొదలుగాగల ముఖ్యాంశములపై 25 సం॥ల మధ్యకాలంలో జరిగిన ఉత్తర ప్రత్యుత్తరములను చూచినచో, వీరి గ్రామ విధానమున్నూ, గాంధిమహాత్ముని అనుబంధమున్నూ తెలియనగును.

'ఆంధ్రకేసరి' శ్రీ టంగుటూరి ప్రకాశంపంతులుగారికి వీరు సన్నిహితులు. ప్రాణమిత్రులు, విశ్వాసపాత్రులు వీరియెడలను వీరి కార్యక్రమములయెడలను పంతలుగారికి అంతులేని వాత్సల్యము.

స్థానికముగా విజయవాడలో పురప్రముఖులు కీర్తిశేషులు శ్రీమాన్ సి. రాజగోపాలాచార్యులుగారు వీరి కార్యక్రమానికి అభిమానులుగా వుండేవారు.

శ్రీ మారేపల్లి రామచంద్రశాస్త్రిగారు వీరినిగూర్చి తనివితీర యిట్లు వ్రాసిరి:

'ఈయన అనుభవశాలి. కష్టనిష్ఠురములకు ఓర్చినదిట్ట. ఖద్దరు సంస్థానము అను వింత సంస్థను నెలకొల్పిన నేర్పరి. పల్లెలలో పుట్టి పట్టణములలో పెరిగి పల్లెలపొత్తు వదలక పల్లెలమేలు కొరకు వుసురులు ధారపోయుచున్న దేశాభిమాని. ఆంధ్రకేసరికి నచ్చిన సహకారి. తెగువరి. వివేకి, దూరదర్శి, ఆర్థికశాస్త్రవేత్త.'

పైన తెలిపిన వీరి అర్హతలను బట్టి చిత్తుచట్టమును తయారుచేయుటకు నేను వీరిని కోరియుంటిని. గ్రామ శాస్త్రములో వీరికిగల యనుభవము చాల గొప్పది. వీరు వ్రాసిన 'గ్రామతత్వము' అను గ్రంథము చదివినచో, విశదము కాగలదు. వీరు తయారుచేసిన ఈ చిత్తుచట్టమును తమరు యెల్లరు పరిశీలించగలరని మా ప్రార్థన.

ఆఫీసు
తెనాలి.
దక్షిణ భారతము,
2-10-1950

ఇట్లు
గ్రామ విశ్వవిద్యాలయము,
బ్రహ్మాండం నరసింహం
వైస్ ఛాన్సలర్.

# విషయ సూచిక

# గ్రామ విశ్వ విద్యాలయ ఉత్పత్తులు

1. **అచ్చుసిరాలు :**
జాబ్ నల్లసిరా
జాబ్ ఇతర రంగు సిరాలు
న్యూస్ నల్లసిరా
న్యూస్ ఇతర రంగు సిరాలు
2. **వ్రాత సిరాలు :**
నీల కృష్ణ ఫౌంటెన్ పెన్ సిరా
శాశ్వత రికార్డు సిరా (దస్తావేజులు)
ఇతర రంగు సిరాలు
3. **సబ్బులు :**
స్నానం సబ్బులు
బట్టల సబ్బు కోపులు
బట్టల సబ్బుపొడి
సబ్బు పేస్టు
తలంటి సబ్బు నీరు
మంగలి సబ్బు క్రీములు
4. **పెయింట్లు :**
రెడాక్సయిడు, చాకొలేటు పెయింట్లు
ఎల్లో ఓకరు, ఇతర రంగుల పెయింట్లు
ఎనామిల్సు, వార్నిష్లు, డిస్టెంపర్లు వగైరా
ఇంట్ల రంగుపని కాంట్రాక్టులు కూడ చేయబడును.

---

**వలయువారు ఇతర వివరముల ఖరీదుల కొరకు**
**గ్రామ విశ్వవిద్యాలయము, శోధన గృహ - తెనాలి**
**వారికి వ్రాసి తెలుసుకొననగును.**

# గ్రామ విశ్వ విద్యాలయము

# విజ్ఞాపన

పశుజాతికి కడుపు నిండుటతో తృప్తి యేర్పడును. తన వినోదము లకర్మకు గాని, తన సంతతికొరకుగాని,తన వృద్ధాప్యదశ కొరకు గాని దాచి పెట్టవలెనను ఆరాటము ఉందు. కనుక వాటితో సామ్యము పెట్టుకొని మానవుని నడకను పోల్చుకొనుచుండుట భావ్యము కానేరదు.

మానవునికి తిండి అవసరమయినట్లే బట్ట అవసరము. ఎండకు వానకు నీడ అవసరము. తన వృద్ధుల కొరకును, తన భార్య, పిల్లల కొరకును దాచియుంచవలెనను ఆరాటము హెచ్చుగా నుండును. ప్రతివానికిని యిట్లేయుండుటవలన వీరిలో వీరు పోరాటము పెట్టుకొని కలహించుచుండుట కద్దు.

ఈ తేడాలు ఎందుకు కలుగుచున్నవని తర్కించుటగాని, ఎట్లు నిర్మూలనము చేయుదమని ప్రయత్నించుటగాని వ్యర్థమైనపని. ఈ తేడాలవలన శాంతిక ఇభంగము కానివిధముగా చేయవలసిన కార్యక్రమమును గురించి యేమరకుండా తగిన కట్టుదిట్టములు చేయుచూ నడుపుచుండుటయే దీక్షాపరుల విధి.

నియమ, నిగ్రహ సంపత్తిని పెంపుచేసి మానవుని యొక్క కోరికలను హద్దులలో పెట్టుకొనుటయే కర్తవ్యము. ఇందుకొరకు మానవునకు శిక్షణ యవసరమగుచున్నది. శిక్షణ యనునది ఒకరోజు, ఒక నెల, ఒక సంవత్సరముతో ముగియునదికాదు. పుట్టుక మొదలు చావువరకు మానవునకు శిక్షణ యవసరము. సమగ్ర శిక్షణ కలవారుకూడ తనతోటి మానవులయొక్క అనుకరణకొరకు తాము శిక్షణలోనుండ వలసిన యవసరము కనబడుచున్నది. ఎంత ముదురుచెట్టునుండి తీసిన విత్తనమైనను మొక్కగా పెరిగి గట్టిపడువరకు ఎట్టి రక్షణ యవసరమో అట్లే యెంత శిక్షణగలవారి సంతు అయినను ప్రత్యేకముగా సరియైన శిక్షణ పొందుట యవసరమని విధిగా తేలుచున్నది. అయితే అట్టివారికి కొంత సౌలభ్యమేర్పడుచుండుట కలదు. దీనినే సరియైన పిత్రార్జితముగా నెంచవలెను.

నేను వ్రాసిన గ్రామతత్వములోని మానవుని యుగప్రభావములును, చిక్కుదశలును గుర్తించిన్నీ, వికేంద్రీకరణ కేంద్రీకరణ సిద్ధాంతములు తెలుసుకొనిన్నీ, మానవుడు మాయలో పండకుండుటకుగాను ప్రతివారికి 15 సంవత్సరములు వయస్సు నిండేలోపల యివ్వదగు శిక్షణను "గ్రామ స్వరాజ్య శిక్షణ" అనుపేరుతో ప్రచురించియుంటిని. ఆ శిక్షణ పొందిన వారికి నిపుణత్వము - సాధిక వికాసము పెంపు అగుటకుగాను 25 సంవత్సరముల వయస్సు వచ్చువరకు తగిన శిక్షణ యిచ్చుటకు 'గ్రామ విశ్వవిద్యాలయము' యేర్పడుట నాకు సంతోషము కలుగజేసినది.

ఇట్టి విషయములను గురించి గత ముప్పది సంవత్సరముల నుండి నేను చేయుచున్న కృషియొక్క అనుభవముతో విశ్వవిద్యాలయమువారు అనుసరించవలసిన విధానముగా ఈ చిత్తుచట్టమును వ్రాసి యిచ్చుచున్నాను. దీనిని చిత్తుచట్టముగా అంగీకరించి విజ్ఞాన సంపత్తితో పరిశీలించి కర్తవ్యమును నిర్వహింతురని ఆశపడుచున్నాను.

మానవ సంఘము ఎంతకాలముండునో అంత కాలము నడపవలసిన కార్యక్రమము ఇది. తాత్కాలిక విషయములతో ముడిపెట్టుకొని భీతి నందకుండా శాశ్వత పరిస్థితులు తెలుసుకొని నిర్ణయించవలసిన ప్రాముఖ్యత యిందుగలదు. లక్ష్యములు ఇందు కనుగుణముగా ఏర్పాటు అయినవి. పెక్కు సంవత్సరములు కాలము పట్టినను ఈ లక్ష్యములు అనుసరించి జయము పొందతగినవై యున్నవి. నియమ, నిగ్రహ సంపత్తితో, లక్ష్యసిద్ధికొరకు ఆరాట పడుటకు యింధు సాధిక యేర్పాటు కలదు. అలసత్వమునకు దారి చూపకుండా చూచుట ప్రధాన కర్తవ్యము. అలసత్వము జొరబడనివ్వకుండా కాపలా కాచుటే విజ్ఞానవంతుల బాధ్యత. ఈ గ్రామ విశ్వవిద్యాలయము యొక్క సమగ్రరూపమును గుర్తించి నడిపినచో విశ్వమానవ కళ్యాణమునకు దారిచూపగలదని నా విశ్వాసము.

గుణదల
ఖద్దరు సంస్థానము
23 -8 -1950

(సం) ఉప్పులూరి వెంకటకృష్ణయ్య,
ఖ ॥. సం॥ ధర్మకర్త.

# గ్రామ విశ్వ విద్యాలయము

# చిత్తు చట్టము

లక్ష్యములు :

1. త్రిగుణములు సృష్టికి మూలకారణములు. సమస్త జీవరాసులలోను మానవునకు మనస్సు అనునది ఉండుట ఒక ఆధిక్యత. తోటిమానవునికంటె అధికుడుగానుండవలెనను కాంక్ష నిరంతరము మానవునకు తొట్రుపాటు కలిగించుచుండును. ఆశలు అధికమైనపుడు మానవుడు మనస్సుచేతను, శరీరము చేతను ఆక్రమములు చేయుచుండును. మానసిక దోషములు సవరించుటకు మతము, శారీరక నేరములను అరికట్టుటకు ప్రభుత్వ శాసనము యవసరము. మానసిక శారీరక నేరములకు అవినాభావ సంబంధము కలదు. ఇది సర్వ మానవ లోకమునకు నైజము. ఇట్టి నేరములు జరుగకుండుటకు రెప్పవాల్చనీ కాపలా యవసరము. ఇది మానవ మతము. ఇట్లుగా గుర్తించి మానవుని నడకను క్రమపద్ధతిలోనికి దిద్దుట గ్రామ విశ్వవిద్యాలయము యొక్క లక్ష్యము.

2. పంచభూతములు మానవునికి జీవనాధారములు. జీవరాసి మనుగడకొరకు తాము మధింపబడుటకు పంచభూతములు నిలచి యున్నవి. పంచభూతముల మధనము వికేంద్రీకరణ మార్గమున

నడుపవలెను. వికేంద్రీకరణ మార్గము ఇటు మానవకోటికిని అటు పంచభూతములకును తీవ్ర సంఘర్షణగాని, శోషణగాని కలిగించనేరదు. వికేంద్రీకరణ విధానము మానవునకు నిరంతరకృషిని కల్పించి వికాసమును పెంపొందించును. కాన మానవ జీవితమునకు వికేంద్రీకరణము పునాదిగా నుండవలెను. వస్తుమార్పిడి విధానము వికేంద్రీకరణముకు ఆయువుపట్టు. ఈ స్థితియొక్క నిలకడకొరకు అవసరమైన కేంద్రీకరణమును నిర్మించుకొనవలెను. కేంద్రీకరణ విధానమును హద్దులలో పెట్టుటకుగాను ప్రత్యక్ష బంగారు ప్రమాణముతో కూడిన నాణెవిధానమును అమలులో పెట్టవలెను. హద్దులేని కేంద్రీకరణ విధానము మానవుని నిరుద్యోగమునకు దింపి దురాశ కలుగజేయును. గాన వికేంద్రీకరణ, కేంద్రీకరణములను సమన్వయపరచి, శిక్షణయిచ్చి బోధించుట గ్రామ విశ్వవిద్యాలయము యొక్క లక్ష్యము.

3. వికేంద్రీకరణ విధానమును గ్రామస్వరాజ్యములో యిమిడ్చి, సగుణశాస్త్రము (Law of possession) వర్తింపచేసి పంచాయితీ పాలన సాగించవలెను. అర్హులైన గ్రామస్థులను వయోజన ఎన్నికలమూలమున పంచాయితీ సభ్యులుగా ఎన్నుకొనవలెను. గ్రామ పంచాయితీవారు గ్రామము యొక్క స్వయంపోషణ, స్వయంరక్షణలకు బాధ్యత వహించి స్వపరిపాలన చేయవలెను. ఇట్టి గ్రామస్వరాజ్యము యొక్క నిలకడ కొరకు పటుత్వముగల కేంద్రీకరణ విధానమును

ప్రభుత్వశాసనములక్రింద ఏర్పరచవలెను. నిర్గుణశాస్త్రము (Law of Non-possession) కేంద్రీకరణకు వర్తింపచేయవలెను. ఈ యుపదేశమును శిక్షణతో బోధించి యలవరచుట గ్రామ విశ్వవిద్యాలయము యొక్క లక్ష్యము.

4. మానవసంఘములో మగ-ఆడవారల యొక్క చిత్తవృత్తుల గుర్తించి వారి వారి వయస్సు అభ్యాసములనుబట్టి ప్రవర్తనలో నియమ నిగ్రహములను మనస్సునకు శరీరమునకు అలవరచుట గ్రామ విశ్వవిద్యాలయము యొక్క లక్ష్యము.

5. మానవ సంఘమునకు శాంతినిచ్చు పై సూత్రములను సంపూర్ణముగా గ్రహించినట్టియు, విచక్షణగలిగి దశకాల పరిస్థితిని గుర్తించి సమభావముతో పై సూత్రములను నడిపించగల శిక్షణతో కూడిన నిపుణులను సాధనపూర్వకముగా తయారుచేయుట గ్రామ విశ్వవిద్యాలయము యొక్క పరమ లక్ష్యము.

# అంగములు

1. వ్యవసాయము - పాడి - 2. వస్త్ర పరిశ్రమ, 3. వస్తు మార్పిడి - 4. గృహ నిర్మాణము (బేల్దారీ, వడ్రం) 5. ఆరోగ్యము - వైద్యము 6. చదువులు - భాషలు - లెక్క, చరిత్ర, భూగోళం, పదార్థ విజ్ఞానము - 7. శాస్త్రములు - న్యాయ వైద్య - ఇంజనీరింగు, తత్వ మొదలుగనవి. 8. కళలు - సంగీత, చిత్రలేఖన, శిల్ప, కవిత్వ, ఇత్యాది 9. గ్రామ పరిశ్రమలు, రంగులు, సబ్బులు, సిరాలు, కాగితము, అచ్చుపని, కమ్మరము, కుమ్మరము, మేదర, చర్మ - నూనెగానుగ, తేనె ఇత్యాది.

10. గుణత్రయ శిక్షణ, నిర్గుణ శిక్షణ, పాలన, రక్షణ పోషణ, జ్ఞాన విజ్ఞాన విషయములు, కేంద్రీకరణము, వికేంద్రీకరణము.

స్త్రీ పురుష శక్తులు, ఇంద్రియస్వభావములు, వీనిని గురించి తెలుసుకొనుటకు పునాది శిక్షణయిచ్చే యావత్తు విధానం.

# గ్రామ విశ్వవిద్యాలయ చిత్తు చట్టమును తయారు చేయుటలో ఆధారభూతమైన పరిశోధనలు

1. పశ్చిమగోదావరిజిల్లా జోగన్నపాలెం గ్రామ నివేదిక 22వ ని సాంఘిక విధానము :

"గ్రామ జనాభాలోని వివిధ అలవాట్లు, వివిధ ఆచారములను చి లోతుకుదిగి ఆలోచించగా స్త్రీలలో ఒక్క వివాహము చేసుకొన్న న్నీ, ఆహారములలో శాకాహారమునకున్నూ, ప్రథమ గౌరవస్థానము న్నుచున్నట్లు బోధపడుచున్నది. మరిన్నీ పైరెండు సిద్ధాంతములను తరములుగా అమలులో పెట్టుటకు కొందరు కఠినమగు శిక్షణావళిని ుసరించుచుననట్లున్నూ, ఆ శిక్షణావళికి మొత్తముమీద వమిచ్చుచున్నట్లునూ తేలుచున్నది. ఇందువలన సాంఘికా రములలో పైకి కనబడుచున్న భేదములు ద్వేషములుగా మారక ధ్యతను పెంపొందించునవిగా సమన్వయింపబడుచున్నవి. వారించగా గ్రామములో వొక వ్యక్తిగాని, వొక కుటుంబముగాని వొక లముగాని భేదము లేకుండా తదితర అన్ని కులములవారితోను, సహపంక్తి భోజనములుగాని, వివాహ సంపర్కములుగాని చేసుకొనుటకు ఇష్టపడువారు కనపడుటలేదు. ఇట్టి విషయములలో బస్తీల వాతావరణమునుంచి వచ్చు సంస్కరణలను గ్రామములలో యెట్లు సమన్వయము చేయవలెనో మనము పరీక్షించవలసిన ముఖ్యవిషయమై

ఘున్నది. విద్యావిధానము, ఆర్థిక విధానము తారుమారగుటవలన
యా విషయములలో గూడ కొన్ని చిక్కులు కలుగుచున్నవి." అని
రాసియున్న హంశము.

2. ఖద్దరుసంస్థాన శిక్షణ నిలయ వేదతరగతి శిక్షణశాఖలోని
గాయత్రి ఉపదేశమును అర్థించు విద్యార్థి దరఖాస్తు :

పేజీ 109/10 ది 16-1 - 1945.

"నేను తరతరములనుంచి ఉపనయనము చేయించుకొను
కుటుంబములకు చెందినవాడను. తూష్ణీం జంధ్యముతో శిక్షణనిలయ
వేద తరగతిలో శిక్షణను పొందుచున్నాను. నాకు 15 సంవత్సరములు
నిండినవి. గాయత్రి ఉపదేశము చేయవలెనని మిమ్ములను అర్థించు
చున్నాను. తరతరములనుంచి శాఖాహారమునకు నియమింపబడిన
వంశమునకు నేను చెందితిని. వితంతూ వివాహములను విడాకులకోరని
స్త్రీల వంశములో పుట్టినాను. చుట్ట, బీడి, మద్యపానము మొదలగు
వాటిని నిషేధించిన కుటుంబములకు చెందివున్నానను.

పై నాగరికతతో కూడిన కట్టుబాట్లయందు గౌరవముంచుచూ,
తెలిసిగాని, తెలియకగాని వాటిని ఉల్లంఘించ కుండా ఉండుటకుగాను
మడి, ఆచారములు మొదలగు నియమముల ద్వారా ఆహార
వ్యవహారములయందు యేర్పాటు కాబడిన సర్వనియమములను
నేను పాటించుతూ ఉండగలందులకు ఆదేశించబడితిని.

గుణత్రయ పరిశోధనకొరకు బాధ్యత చేయబడిన కులమునకు చెందినవాడను. ఉపనయనము సాత్విక శిక్షణగాను దానికి గుర్తుగా వొక జంధ్యమున్నూ, వివాహము గుణత్రయ సమన్వయ శిక్షణగాను దానికి గుర్తుగా మూడు జంధ్యములున్నూ, వేసుకొని బహిరంగ గుర్తుతో నా జీవితము ద్వారా మిగతావర్గములవారు గుణత్రయ ప్రభావములను హద్దులలో పెట్టుకొనునట్లుగా నా ప్రవర్తనద్వారా ప్రదర్శించవలెనని ఆదేశించబడినాను.

మీవలన గాయత్రి ఉపదేశము పొందిన మీదట నాకు కలుగు అర్హతతో ముందు పొందవలసిన అభివృద్ధికి కృషి చేయుటకు ఆశీర్వదించకోరెదను.

నేను పొందిన శిక్షణమూ, నా యోగ్తలున్నూ, తెలియజేయు, శిక్షణ నిలయాధికారుల యోగ్యతా పత్రమును యిందుకు జత చేసుకొన్నాను. దీనిని నా స్వదస్తూరీన నాకు లభించిన నాల్గు భాషలతో లిపి వ్రాసి మీకు యిచ్చుచున్నాను.

ఇట్లు విధేయుడు

" విద్యార్థి "

3. ఖద్దరు సంస్థాన కార్యక్రమము వాటి అనుభవములు "గ్రామతత్వం" 'ఇన్‌ఫ్లేషన్' గ్రంధములు :

4. పట్టణ నగర అభ్యాసములు, ప్రపంచ కేంద్రీకరణ విధాన ఫలితములు. ఈనాటి రాజ్యపరిత్యాగ చరిత్ర.

5. అఖిల భారత చరఖా సంఘ, గ్రామ పరిశ్రమల సంఘం, గోసేవా సంఘం, హరిజన సేవా సంఘం, హిందీ ప్రచారసంఘం, నయీతాలిమీ సంఘం, ప్రభుత్వ నడకలు.

షరా : భారతదేశ గ్రామనడక అంతా పైమాదిరిగానే యున్నది. పట్టణములయినా దాదాపు అంతే. వివిధ మతములు సహితము దాదాపు విధానమంతగానే వుండును. భాషల తేడాలు, అంకెలతేడాలు ఉండునుగాని సిద్ధాంతములు, ఆచరణ ఒకటిగానే ఉన్నది. పత్రికలు, గ్రంధకర్తలు, విశ్వవిద్యాలయములు, ప్రజానాయకుకలు వాస్తవ పరిస్థితు లను గుర్తించలేక పాశ్చాత్య వ్యామోహ పూరితులయి, మానవతత్వం గ్రహించక దారి తప్పినారని గ్రామతత్వం చెప్పుచున్నది. ఈ గుర్తింపుతో ఈ చట్టము తయారు చేయబడినది.

# నిబంధనలు

1) గ్రామస్వరాజ్య శిక్షణలో ఉత్తీర్ణులైనవారికి 25 సంవత్సరముల వయస్సు లోపల శిక్షణకు యిందు ప్రవేశ అర్హత వుండవలయును.

2) ఇందుకొరకు కృషి చేయుటకు 16 మంది శాశ్వత కుటుంబ సభ్యులను శిక్షణ యిచ్చి తయారు చేయవలెను. వీరే సిండికేటుగా వ్యవహరించవలెను. అయిదుగురు చేరగానే సిండికేటు ప్రారంభం కావలెను.

3) ఒక ఛాన్సలరు, ఒక వైసు ఛాన్సలరు, ఒక ప్రొఫెసరు, ఇద్దరు ప్రబోధకులు వుండి దీనిని నడిపంచవలెను. ఇదే సంపూర్ణ అధికారం గల పంచాయితీ కమిటీ, అవుసరమయిన ఉపాధ్యాయులను నియమించుకొనవలెను.

4) ఉపదేశంకు 35 సంవత్సరముల వయస్సు తేడా ప్రబోధంకు 25 సంవత్సరముల వయస్సు తేడా, ఉపాధ్యాయత్వమునకు 15 సంవత్సరముల వయస్సు తేడా ఉండాలి. చర్చకు సమానుడు. నియమ నిగ్రహ - అనుభవ గుర్తింపు వుండాలి.

5) సమిష్టి పంటల సందర్భముననూ, వడ్డనల సందర్భముననూ తరతముల నుంచి శాకాహార నియమము నందు శౌచత్వనిపుణత గలవారలకు ప్రాధాన్యత యిస్తూ వుండవలెను.

# దినవారీ నడక

## కాలమానములను గుర్తించి

ఉదయము,

గం 5 -- 0 నిద్రలేచుట - 10 నిముషములు ప్రార్థన కాల కృత్యములు పాచిపనులు - వ్యాయామం, (అయిదు గంటలకు పూర్వం లేదరాదనికాదు. అయిదు దాటిన తరువాత పిల్లలు కాని పెద్దలు కాని పడివుండరాదు.)

7 - 0 చల్దులు - పనిపాటలు - చదువు

11 - 0 భోజనం -

మధ్యాహ్నము.

1 -- 0 మొ॥ 2 గంటల వరకు సూత్రయజ్ఞం.

2 - 0 5 -- 0 చదువులు పరిశ్రమలు -

సాయంత్రము

5 -- 0 6 -- 0 పారిశుధ్యం - ఆటలు - తోటపనులు వల్లన

7--0 భోజనం - చింతన - ప్రార్థన మననము.

9--0 నిద్ర - పగలు నిద్ర కూడదు.

ఈ గమనింపుతో కాలమానమును బట్టి సవరించుకుంటూ వుండనగును.

# భోజనముల నడక

ఆదివారము - కాయకూర - పప్పుకూర - వూరగాయ

సోమవారం - ఆకుకూర - (పులుసు) ఉశిరి

మంగళవారం - దుంపకూర పచ్చడి

బుధవారం - కాయకూర - పప్పుకూర - వూరకాయ

గురువారం - ఆకుకూర - (పులుసు) - ఉసిరి

శుక్రవారం - దుంపకూర - పులుసుపచ్చడి

శనివారం - తేలికపారు ఆహారం

సామాన్య పరిస్థితులలో యీ సూత్రములను అనుసరించి అమలు జరిగించుతూ వుండవలెను.

# యేబదిమందికి ఖర్చు అంచనా

200 బస్తాల ధాన్యాదులు సాలుకు

12 బస్తాల అపరాలు ॥

12 బస్తాల నూనెల గింజలు ॥

మణుగుకూర రోజుకు

10 శే॥ పాడిపవరు ॥

అరపలక కట్టెలు ॥

ఇరువదివిచ్చెలనూలు రోజుకు

ఇందుకుసాలుకు 30 మ దూది

ఫలములు కాలగతిని అనుసరించి -

పూరకాయలు - వొరుగులు కాల

మానమును అనుసరించి.

ఓషధికి సంబంధించిన వనరులు,

ప్రకృతివైద్య వనరులు, పనిముట్లు.

| | |
|---|---|
| 200 శే వుప్పు | 1 మ జీలకర్ర |
| 15 మ మెరపకాయ | 2మ ఆవాలు |
| 10 మ చింతపండు | 60తు ఇంగువ |
| 10 మ బెల్లం | 1 బ ధనియాలు |
| 2 మ మెంతులు | 4 వీ మిరియాలు |
| | 4 వీ శొంఠి |

**అలంకారములు - పూలు**

అయిదు సంవత్సరములు నికరమగు లెక్కలతో సరిచూచి అంచా సరి చేయవలసి వుండును.

# ఉన్న వనరులు

**1. తెనాలి :** శ్రీ బ్రహ్మాండం నరసింహంగారి తాలూకు (1) తెనాలిలోని శోధన్ గృహము (2) పెయింటు పరిశ్రమమీద రాదగిన ఆదాయము (3) శ్రీ బ్రహ్మాండం ఆంజనేయులుగారి తాలూకు తెనాలి శోధన్ గృహములోని పారిశ్రామిక గ్రంథాలయము, పరిశోధనాలయ్యపు వనరు, (4) వీరితాలూకు అచ్చుసిరా, సబ్బు, వ్రాతసిరా పరిశ్రమలలోని విద్యార్థులందరి తరిఫీయతు - ఆదాయపు వనర్లు.

**2. మంత్రిపూడి :** మంత్రిపూడిలోని (1) శ్రీ బ్రహ్మాండం ఆంజనేయులుగారి తల్లిగారయిన పున్నమ్మగారి తాలూకు భవనము (2) శ్రీ పున్నమ్మగారి తాలూకు య. 4 రాలుడెల్టా పల్లంమీద వచ్చే ఆదాయం.

**3. గుణదల :** ఖద్దరు సంస్థానంవారికి గుణదల గ్రామంలోని వారివాటా ఆదాయపు వనరు - వ్యవసాయపు వనరు.

**4. విజయవాడ :** గాంధివిలాస్ భవనము - గ్రామ స్వరాజ్య ప్రెస్ వనరు :

**5. జోగన్నపాలెం :** 1. గ్రామస్వరాజ్య పీఠమువారి గ్రంథమాల (2) ప్రెస్ షేరు (3) య 7 - 20 శెంట్లు మామూలు అప్లాండు

పల్లంభూమి (4) జోగన్నపాలెం శ్రీరామమారుతీ సేవాసంఘమువారి తీర్మానము ప్రకారం షుమారుయ 10 - 0 లు మామూలు అప్లాండు పల్లం భూముల మీద వచ్చే వనరు. (5) దేవాలయసేవ (6) గ్రామస్థుల విరాళములు. (7) గ్రామస్వరాజ్యపీఠంవారి 2000 గజముల నివేశస్థలం భవనమ్ములు, కుటీరములు.

## నడపవలసిన కార్యక్రమము

1) గ్రామస్వరాజ్య శిక్షణ తరగతులు ఆదర్శవంతముగా.

2) యూనివర్సిటి తరగతుల కొరకు శిక్షణగల విద్యార్థులు సమకూరేవరకు 25 to 45 వయస్సు గల వారలకు వయోజన శిక్షణ, ప్రబోధము - అంటే 15 రోజాల క్లాసుల వంటివి.

3) పాఠ్య వివరములు - గ్రంధములు తయారు చేయవలయును. సహాయకులు - అభిమానుల యొక్క పరిమితిని తెలుసుకోవలయును.

4) వ్యవసాయం - వస్త్రపరిశ్రమ - ఇతర గృహ పరిశ్రమలు - పాడి, పశుపోషణ, ప్రెస్సు - రంగులు పరిశ్రమ - ఇత్యాదివన్ని స్వయం పోష్యంగాను, ఆదాయ వనరులుగాను, శిక్షణ రూపకంగాను వినియోగ పడవలెను.

5) వస్తుమార్పిడి విధానము జతచేసి నాణె సంకెళ్ళ నుండి జీవితమును రక్షించవలెను.

# గ్రామ స్వరాజ్య శిక్షణ

## (15 సంవత్సరములు వయస్సు నిండేలోపల)

1. తెనుగులో మనుచరిత్ర వరకు. వ్యాకరణం - కవిత్వధోరణి - పంచాంగం - రామాయణం పురాణంగా చదువుట - వెయ్యి పద్యములు కంఠస్తము చేయుట.

2. హిందీలో ప్రాథమిక - మధ్యమపరీక్షలలో వుత్తీర్ణత - రాష్ట్రభాష ప్రవేశం.

3. సంస్కృతంలో రఘువంశం - కుమార సంభవం - మేఘ సందేశములు వరకు.

4. ఇంగ్లీషులో 5 పుస్తకములున్నూ కొన్ని ప్రత్యేక పుస్తకములు చదివించుట.

5. నాల్గు లిపులలో మంచి దస్తూరి అలవర్చుట.

6. అమరములో ప్రథమ - ద్వితీయ కాండలు కంఠస్తము.

7. భగవద్గీతలో 2 - 12 అధ్యాయములున్నూ, ప్రార్థన పద్యములున్నూ, కంఠస్తము, లెక్క విధానము, భూగోళము - చరిత్ర- ఆరోగ్య శాస్త్రములలో ప్రవేశము, ప్రపంచ పటము మీద గుర్తింపులు - పత్రికలు చదివించుట - సంగీతం నేర్చుట, భజన విధానం అలవర్చుట.

# పరిశ్రమలు

1. వ్యవసాయము. రోజుకు అర యకరము దున్నె అలవాటు - కూరకాయలు పెట్టుట, పెంచుట, కలుపుతీత, పైరుకోత, పాదులు చేయుట, పార, పలుగు బాగా ఉపయోగించుట, పాలు తీయుటలో అనుభవము అలవర్చుట.

2. వస్త్ర పరిశ్రమ. ప్రత్తిపట్టుట, ఏకులు చేయుట, తక్లీ రాటముల పై వడుకుటలో నిపుణత్వము సంపాదించుట, బహుమతులు పొందుట, రోజా 8 గంటలలో 3 విచ్చెల ప్రాప్తి న నెలరోజులు దక్ష పూర్తి చేయుట, రోజుకు పౌను ప్రాప్తిన నెలరోజులు యేకులుచేయు దీక్ష పూర్తిచేయుట, నేత ప్రవేశం.

3. ఇతర పరిశ్రమలు : ప్రెస్సు పనులు, వంట, వడ్డన, నడక, విస్తళ్ళు, నులక, నవ్వారు, మంచం అల్లుట, మోత పలుపులు, కుంది కసరత్తు (5 ని॥లలో 3 శేర్ల ధాన్యం దంచుట) కట్టెలు కొట్టుట, ఎరువు జాగ్రత్త చేయుట, బల్లకట్టు నడుపుట, దండెములు, బస్కీలు, ఆసనములు వేయుట, వడ్రం, కమ్మరం చాపలు అల్లుట, పారిశుధ్యము, బోధించుశక్తి, యిత్యాది పనులలో అభ్యాసము. నేర్పరితనపు పనులలో రోజుకు 3 టిక్కట్లు సంపాదించే శక్తి అలవర్చుట, వైద్య విధానం బోధించుట.

4. వేదతరగతి వారికి ప్రత్యేక నిబంధనలు, జ్యోతిషము.

5. నిపుణత్వము గల వారలను కాలేజి (గ్రామవిశ్వవిద్యాలయ శిక్షణకు) పంపుట.

## ఇందుకొరకు ఉండవలసిన గ్రంథములు

1) కృతయుగ బాలశిక్ష, 2) త్రేతాయుగ బాలశిక్ష 3) ద్వాపరయుగ బాలశిక్ష, 4) కలియుగ బాలశిక్ష, 5)జోగన్నపాలెం గ్రామ నివేదిక.

2) సుమతిశతకం, వేమనశతకం, కుమారశతకం, కుమారీశతకం, రుక్మిణీ కళ్యాణం, భాస్కర శతకం.

3) వాచకములు అయిదు. గ్రామస్వరాజ్య పీఠగ్రంథమాల ప్రచురణలు.

4) నీతిచంద్రికలో మిత్రలాభం, మిత్రభేదం, సంధి, విగ్రహం.

5) మను చరిత్ర, వసుచరిత్ర.

6) ఆంధ్రనామ సంగ్రహం, ఆంధ్ర నామశేషం, సాంబ నిఘంటువు.

7) బాలవ్యాకరణం, సరళ వ్యాకరణం.

8) రామాయణం.

9) భారతం.

10) భాగవతం.

11) గీత.

12) గాంధి మహాత్ముని జీవిత వివరములు.

## సంస్కృతం

1) శబ్దమంజరి, బాల రామాయణం

2) అమరం.

3) రఘువంశం, కుమార సంభవం, మేఘసందేశం, భారవి, మాఘం,

4) శాకుంతల.

5) సంస్కృత రామాయణం.

## హిందీ

పంచకావ్యములు.

హిందీ రామాయణం.

## ఇంగ్లీషు

పంచకావ్యములు.

# మొదటి తరగతి

## (6 సంవత్సరముల వయస్సు గలవారు)

1) మాతృభాష అక్షరాభ్యాసము - అదివరకు తల్లిద్వారా వచ్చిన వల్లన పరీక్ష - వల్లన ప్రారంభం.

ఆటలలో ఇమిడ్చి వుత్పత్తికి సహకరించే పనులలో పరీక్షలు పెట్టి సాధిక అలవర్చవలెను. బలపములు - తినుబండారములు బహుమతులు పెట్టవచ్చును.

తక్లిమీద నూలు వడికించుట, ప్రత్తి బాగుచేయించుట, యేకులు చుట్టించుటలో ప్రవేశపెట్టాలి. నిద్రలేచుటలో శ్రద్ధ పెట్టాలి.

నారుకట్టలు మోయించుట, మట్టి - ఇటుక - గడ్డి - చేరవేయించుట - యెరువు జాగ్రత్త చేయించుట - పారిశుధ్యము పనులు చేయించుటలో, ఆటలు పద్ధతిని అలవర్చవలెను. దైవపూజ - ఫలహారంకు ముడిపెట్టాలి.

విసుకులేని ఉపాధ్యాయునిమీద ఈ పునాది ఆధారపడివున్నది. దీనిని గురించి అతి సూక్ష్మవిషయములతో దినచర్య వ్రాయించాలి. ఛాన్సలరు - వైసుఛాన్సలరు - ఉపదేశకులు - ప్రబోధకులు- ఉపాధ్యాయులు ఈ తరగతిలో బాధ్యత పెట్టుకొని తమ జ్ఞానసంపత్తిని జిజ్ఞాసకు తెచ్చి భావికార్యక్రమం నిర్ణయించుతూ వుండాలి.

# మొదటి తరగతి

## (6 సంవత్సరముల వయస్సు గలవారు)

1) మాతృభాష అక్షరాభ్యాసము - అదివరకు తల్లిద్వారా వచ్చిన వల్లన పరీక్ష - వల్లన ప్రారంభం.

ఆటలలో ఇమిడ్చి వుత్పత్తికి సహకరించే పనులలో పరీక్షలు పెట్టి సాధిక అలవర్చవలెను. బలపములు - తినుబండారములు బహుమతులు పెట్టవచ్చును.

తక్లిమీద నూలు వడికించుట, ప్రత్తి బాగుచేయించుట, యేకులు చుట్టించుటలో ప్రవేశపెట్టాలి. నిద్రలేచుటలో శ్రద్ధ పెట్టాలి.

నారుకట్టలు మోయించుట, మట్టి - ఇటుక - గడ్డి - చేరవేయించుట - యెరువు జాగ్రత్త చేయించుట - పారిశుధ్యము పనులు చేయించుటలో, ఆటలు పద్ధతిని అలవర్చవలెను. దైవపూజ - ఫలహారంకు ముడిపెట్టాలి.

విసుకులేని ఉపాధ్యాయునిమీద ఈ పునాది ఆధారపడివున్నది. దీనిని గురించి అతి సూక్ష్మవిషయములతో దినచర్య వ్రాయించాలి. ఛాన్సలరు - వైసుఛాన్సలరు - ఉపదేశకులు - ప్రబోధకులు- ఉపాధ్యాయలు ఈ తరగతిలో బాధ్యత పెట్టుకొని తమ జ్ఞానసంపత్తిని జిజ్ఞాసకు తెచ్చి భావికార్యక్రమం నిర్ణయించుతూ వుండాలి.

# మూడవ తరగతి

ఇది ఉపాధ్యాయులు, పెద్ద విద్యార్థులు బాధ్యత పెట్టుకొని ప్రణాళిక ననుసరించి నడిపించవలసిన తరగతి ప్రారంభం.

తనపలక - బలపం- పుస్తకం - తనతక్లీ - తన ఆసు జాగ్రత్త చేసుకొనుట బాధ్యత చేయాలి. చదువు - వృత్తి వలన బహుమానములు పొందగలిగే ఆసక్తి కలుగచేయాలి. స్వార్జితపుటిక్కట్లకు ప్రాధాన్యం యిస్తే ఇది నడుస్తుంది.

| | | |
|---|---|---|
| కాలమానములు | చూచివ్రాత | పత్తిబాగుచేయుట |
| కొల్తమానములు | చెప్పువ్రాత | తక్లీ గ॥200 గం॥కి |
| ద్రవ్యమానములు | కంఠఃస్తవ్రాత | యేకులు చుట్టుట |
| తూనికమానములు | అంకెలకుదురు | గడ్డికోత |
| కుమారశతకము | లెక్కలు | పారిశుధ్యము |
| రుక్మిణీకళ్యాణము | | రాట్నం గం॥250 గ. |
| రెండవ వాచకం | | కంద కసరత్తు |
| గత-వల్లన-మననం | | ఆటలు |
| బాలరామాయణము | | రక్షణవిధానకవాతు |

# నాలుగవ తరగతి

| | | |
|---|---|---|
| గతివల్లనమననం | చూచివ్రాత | ప్రత్తివిత్తనములు తీయుట |
| త్రిలోకపదాలవల్లన | చెప్పువ్రాత | తక్లీ గం॥250 గజములు |
| గీత 2వ అధ్యాయం | వల్లనవ్రాత | రాట్నంగం॥350 గజములు |
| భాస్కరశతకం | అంకెలకుదురు | కుందికసరత్తు |
| 3-4 వాచకములు | లెక్కలు | యేకులు చుట్టుట |
| వేదతరగతిశిక్షణ | వ్యాకరణము | పారిశుధ్యము |
| ప్రారంభం | | |
| (నక్షత్రేష్ఠి) | | ఆటలు - ఈత |
| | | రక్షణ విధాన కవాతు |

# అయిదవ తరగతి

వల్లన, విచ్చె, కుందికసరతు, దీక్షలు పూర్తిచేసిన తరువాత సంస్కృతము, అక్షరాభ్యాసము, శబ్దమంజరి, అమరము, ప్రారంభము.

| | | |
|---|---|---|
| గతవల్లనమననం | వ్యాకరణం | తక్లీ 300 గ॥ గం |
| గీత 12వ అధ్యాయము | చూచివ్రాత | రాటం 350..... |
| 5వ వాచకం | చెప్పువ్రాత | ఆసు, యేకుట |
| మిత్రలాభం | వల్లనవ్రాత | పారిశుధ్యం, ఈత |

| | | |
|---|---|---|
| సంస్కృత అక్షరాభ్యాసం | లెఖ్ఖలు | గడ్డికోత |
| శబ్దమంజరి | చరిత్ర | పాలుతీయుట |
| అమరం | భూగోళం | కుందికసరత్తు |
| (వేదతరగతి శిక్షణ) | చిత్రలేఖనం | విచ్చెదీక్ష |
| | | వంటసహాయము |
| | | రక్షణవిధానకవాతు |

# ఆరవ తరగతి

| | | |
|---|---|---|
| గతవల్లనమననం | వ్యాకరణం | తక్లీనూలు 300 గ॥ |
| మిత్రభేదం | చూచివ్రాత | రాటం 350 గ॥ |
| అమరం | చెప్పువ్రాత | ఆసుగంటకు 2పు |
| రఘువంశం | వల్లనవ్రాత | యేకుట, ఈత |
| (వేదతరగతి శిక్షణ) | ధోరణివ్రాత | పాలుతీత |
| విద్యార్థిని గతశిక్షణ | చరిత్ర | కుందికసరత్తు |
| అభివృద్ధినిగూర్చి | భూగోళం | గడ్డికోత |
| పరిశీలించవలెను | చిత్రలేఖనం | కుందికసరతుదీక్ష |
| | లెఖ్ఖవిధానం | 2 విచ్చెల దీక్ష |
| రక్షణవిధానకవాతు | (పశుపోషణ) | వంటసహాయ |

కురదలా భర్తీ చేయవలెను.

# యేడవ తరగతి

(వయస్సు 12 సంవత్సరములు నిండుతమి)

ఇంగ్లీషు అక్షరాభ్యాసం హిందీబాలబోధిని ప్రారంభం. విద్యార్థి యొక్క గమనికను బట్టి కొన్ని భాషలు కొన్ని సాధనలు నిలిపివేయవచ్చును. నిలిపివేయని వారికి సమగ్ర సమన్వయ శిక్షణతో గ్రామస్వరాజ్య శిక్షణ పూర్తి చేయాలి. నిలిపివేసిన వారికి వచ్చిన శిక్షణను గట్టి చేయాలి. వల్లన - వ్రాత - రెండు విచ్చెలదీక్ష - యేకుట - కుందికసరత్తు దీక్షలలో నెగ్గాలి. ఇది ఒక పరీక్ష. ఇది అందరకు వుండాలి.

ఆసనములు, సాము, కసరత్తును, స్వయంపోష్యజీవితమునకు ఆధారమైన శరీర కష్టములో హెచ్చుగా యిమడ్చాలి. చిత్రలేఖనం ప్రారంభం చేయాలి.

| | | |
|---|---|---|
| గతవల్లన మనవం | | తక్లీ |
| సంధి - విగ్రహం | వ్యాకరణం | రాట్నం |
| రఘువంశం | చూచివ్రాత | ఆసు |
| ఇంగ్లీషు | చెప్పువ్రాత | యేకుట |
| హిందీబాలబోధిని | వల్లనవ్రాత | ఈత |

| | | |
|---|---|---|
| (వేదతరగతి శిక్షణ) | ధోరణి(వ్రాత | పాలుతీయుట |
| | చరిత్ర | (పశుపోషణ) |
| | భూగోళం | కుందికసరత్తు |
| | చిత్రలేఖనం | గడ్డికోత |
| | లెక్కలవిధానం | అచ్చుపని |
| నూలుపురి | వ్యవసాయకృషి | పడవ నడుపుట |
| వంటపని | రక్షణవిధానకవాతు | |

# ఎనిమిదవ తరగతి

| | | |
|---|---|---|
| పాతవి మననం | వ్యాకరణం | వ్యవసాయంకృషి |
| హిందీ ప్రాథమిక విధానం | లెఖ్ఖలు | బట్టకృషి |
| ఇంగ్లీషు, డిటో | చరిత్ర | ప్రెస్సుకృషి |
| (వేదతరగతి శిక్షణ) | భూగోళం | పాడికృషి-పశుపోషణ |
| చిత్రలేఖనం | ఈత | కుందికసరత్ |
| రక్షణవిధానకవాతు | పడవనడుపుట | వంటపని |

# తొమ్మిదవ తరగతి

| | | |
|---|---|---|
| మనుచరిత్ర | వ్యాకరణం | నాగలిపని |
| రఘువంశము | లెక్కవిధానం | నేతకృషి |
| హిందీమాధ్యమిక | చరిత్ర | అచ్చుపని |

| | | |
|---|---|---|
| ఇంగ్లీషు డిటో | భూగోళం | చిల్లరపనులు |
| పంచాంఙ్గం శిక్షణ | చిత్రలేఖనం | 3 విచ్చెలదీక్ష |
| (వేదతరగతి శిక్షణ) | వైద్యపద్ధతి | 7 కుందుల దీక్ష |
| గతవల్లనమననం | హాస్టలు నిర్వహణ | ఈత |
| పత్రిక చదివించుట | పడవ నడుపుట | వంటపని |
| ప్రపంచపటంమీద | | రక్షణవిధానకవాతు |
| గుర్తింపుచేయుట | | |

# గ్రామస్వరాజ్య శిక్షణ

(పదవ తరగతి)

| | | |
|---|---|---|
| రామాయణం | వ్యాకరణం | నాగలిపని 1/2 య |
| మేఘసందేశం | హాస్టలునిర్వహణ | నేతపని 5 మూ |
| హిందీరాష్ట్రభాష | పత్రికచదువుట | అచ్చుపని |
| ఇంగ్లీషు డిటో | | చిల్లరపనులు |
| గతవల్లనమననం | | 2వ తరగతికి వల్లన చెప్పుట |
| కవిత్వధోరణి | | 3వ తరగతికిడిటో |
| పంచాంఙ్గం | | పడవ నడుపుట |
| (వేదతరగతి శిక్షణ) | | వంటపని |
| రక్షణవిధానకవాతు | | |

# గ్రామస్వరాజ్య శిక్షణ

## పరీక్షా విధానము (15 సం॥ నిడుతవి)

## 'శిక్షితుడు' అను బిరుదు అర్హత

విద్యార్థియొక్క మనస్సు శరీరశక్తులు గమనించి వూగులాట-తొట్రుపాటు - దురాశ పడకుండా ఖచ్చితమగు సలహాలనిస్తూ విద్యార్థియొక్క భావిఅభివృద్ధికి, దారి చూపించవలెను.

సాధిక - అభ్యాసము - వల్లనయొక్క శిక్షణతో మనస్సు వయస్సు ముదిరినకొలది క్రమేణా మననము ద్వారా గ్రహించునట్లు చేసేది వికేంద్రీకరణ విధానము. ఈ రీత్యా శరీరంద్వారా సర్వవృత్తులతో స్వయపోష్యంతో ఆరితేరగలుగుతాడు. ఇప్పటి యూనివర్సిటీలు - కాలేజీలద్వారా ఇస్తున్న శిక్షణ కేంద్రీకరణను వూహతో గుర్తించుటకున్నూ, నాలుకతో ప్రకటించుటకున్నూ, చేతితో వ్రాయుటకున్నూ, యంత్రములను నడుపుటకున్నూ మాత్రమని తెలుసుకోవాలి. ఈ తారతమ్యములు తెలుసుకొని పరీక్షావిధానము అమలు చెయ్యాలి.

విద్యార్థి స్వయంపోష్యంతో కూడిన స్వతంత్రజీవి అయినప్పుడే ఈ శిక్షణకు వారి ముందు జీవితములో ఉపయోగపడగలదని నమ్మకము స్పష్టము చేయవలసి వుంటుంది.

# గ్రామ విశ్వవిద్యాలయ శిక్షణ విధానము

**రెండు సంవత్సరముల కాలము**

కావలసిన పుస్తకాలు :

1. భారతము

2. ప్రపంచ ఆధునికవిజ్ఞాన సమగ్రచరిత్ర

3. శరీర సమగ్రశాస్త్రము - సూక్ష్మప్రాయంగా

4. పంచభూతముల చరిత్ర - స్థూలప్రాయంగా

5. ప్రాణులచరిత్ర - స్థూలప్రాయం

6. గత శిక్షణ విధానములో నుంచి స్వార్జిత శక్తిని నిపుణత్వమును జతచేసి అలవర్చుట.

7. లెఖ్ఖలు, కొల్తల విధానము.

8. చరిత్ర, భూగోళములు.

9. కళలు, రాచకీయములు.

సిద్ధాంతములు; నడకను గురించిన గ్రంథాలు చదివించవలెను.

మూడవ సంవత్సరం

# అనుభవ పరీక్షలు విధానము

(ఒక సంవత్సం)

1. విద్యార్థియొక్క ఆశయ ఫలితం తేలాలి. 18 సంవత్సరములు నిండుతాయి. ప్రభుత్వ ఉద్యోగమా- ఉపాధ్యాయత్వమా - న్యాయశాస్త్రమా - వైద్యమా- వ్యవసాయమా- పరిశ్రమవిధానమా- ఇంజనీరింగా- మిలిటరీయా? దేనికి అర్హత ఐతే ఆయా ప్రత్యేకశాఖలలో ప్రవేశ అర్హత ఉండాలి. విద్యార్థి పొరపాటుదారి పట్టకుండా అభివృద్ధి మార్గాన పడాలి. ఇందులో ప్రభుత్వ బాధ్యత ఉంటుంది. ఇందులోనుంచి ప్రభుత్వం విద్యార్థులను యేరుకొని తన మంగు బాగుచేసుకోవాలి. విచక్షణ లేకుండా విద్యార్థులకు దురాశపెట్టి వారిని నిరుద్యోగులుగా చేయరాదు.

ఇంతవరకు నెగ్గినవారలు ప్రభుత్వ సంబంధమునకు పోకుండా, ప్రజాజీవితములో యిమిడి, విద్యాసంపన్నత పొంది 35 సంవత్సరముల అనంతరం శాసనసభలకు అభ్యర్థులుగా నిలబడి పోటీచేసి జయమొంది మంత్రిత్వము స్వీకరించి రాజ్యాంగమును నడపగల శక్తి అలవరచు కొనుటకు అవకాశం ఉండులాగున విద్యార్థికి హితము చెప్పవలసి ఉండును. ఇక్కడనుంచి జీవితం మారవలెను. అధికారం యొక్క పరిశీలన కోరువారు ప్రభుత్వ ఉద్యోగసంబంధమును అలవరచు

కోవలయును. ప్రభుత్వ ఉద్యోగముమీద కాంక్ష పడేలాగు చేయరాదు. స్వతంత్ర జీవితంలో ఎక్కువ మన్నన పొందే అవకాశములు గుర్తింపజేస్తూ వుండవలెను. ధనము - ముక్తి రెండువైపులనుంచి పొందగలరు. ఈ విచక్షణాజ్ఞానముతో విద్యార్థి తాను సాధించుకొనేలాగు హెచ్చరించవలెను. కళాభ్యాసరుచిని పెంచవలయును. ఇందులో ఉత్తీర్ణులయినవారికి భావి అభివృద్ధికి ప్రభుత్వం పూనుకోవాలి.

షరా : ఇప్పటికి సాహిత్యపునాదిన్నీ, రోజులో అరయకరం దున్నే శక్తిన్నీ, రోజుకు 5 మూళ్లు నేతనేసే శక్తిన్నీ, వీటికి అనుబంధమగు అనేక కళలు అలవడును. ఇంతటితో ఈ శిక్షణ నుంచి తొలగిపోయేవారు అభిమానవృత్తిలో ఆరితేరి 35స ంవత్సరముల వయస్సువరకు న్యాయార్జన చేస్తూ "యోగ్యుడు" అనే బిరుదు తెచ్చుకొని గ్రామకార్యదర్శిగా కృషిచేసి క్రమేనా అనుభవజ్ఞానం ద్వారా శాసనసభలకు పోటీచేసి మంత్రిత్వము వంటి కార్యనిర్వాహకత్వము చేసే అవకాశం గలదని బోధించవలయును.

కోవలయును. ప్రభుత్వ ఉద్యోగముమీద కాంక్ష పడేలాగు చేయరాదు. స్వతంత్ర జీవితంలో ఎక్కువ మన్నన పొందే అవకాశములు గుర్తింపజేస్తూ వుండవలెను. ధనము - ముక్తి రెండువైపులనుంచి పొందగలరు. ఈ విచక్షణాజ్ఞానముతో విద్యార్థి తాను సాధించుకొనేలాగు హెచ్చరించవలెను. కళాభ్యాసరుచిని పెంచవలయును. ఇందులో ఉత్తీర్ణులయినవారికి భావి అభివృద్ధికి ప్రభుత్వం పూనుకోవాలి.

షరా : ఇప్పటికి సాహిత్యపునాదిన్నీ, రోజులో అరయకరం దున్నే శక్తిన్నీ, రోజుకు 5 మూళ్లు నేతనేసే శక్తిన్నీ, వీటికి అనుబంధమగు అనేక కళలు అలవడును. ఇంతటితో ఈ శిక్షణ నుంచి తొలగిపోయేవారు అభిమానవృత్తిలో ఆరితేరి 35స ంవత్సరముల వయస్సువరకు న్యాయార్జన చేస్తూ "యోగ్యుడు" అనే బిరుదు తెచ్చుకొని గ్రామకార్యదర్శిగా కృషిచేసి క్రమేనా అనుభవజ్ఞానం ద్వారా శాసనసభలకు పోటీచేసి మంత్రిత్వము వంటి కార్యనిర్వాహకత్వము చేసే అవకాశం గలదని బోధించవలయును.

# ప్రభుత్వ సంబంధపు నిపుణత్వ శిక్షణ విధానము

(అయిదు సంవత్సరములు)

ఉద్యోగ అర్హత కొరకు :

1. సైన్య విధానం
2. ఫ్యాక్టరీ విధానం
3. వైద్యవిధానం
4. ఇంజనీరింగు విధానం.
5. పరిపాల విధానం - చట్టము, న్యాయశాస్త్ర విధానం

కళాభ్యాస శిక్షణ :

ప్రజాప్రాతినిధ్యం కొరకు :

1. అభిమాన వృత్తిలో అయిదుసంవత్సరముల నిపుణత్వ శిక్షణ - కళాభ్యాసము

3. ప్రభుత్వధర్మములు - శాసనములు గురించిన బోధ -

3. ప్రభుత్వవుద్యోగులు, అధికారులు గురించిన బోధ -

4. పత్రికా నిర్వహణ, ఎన్నికల విధానమును గురించిన బోధ -

5. సత్యాగ్రహ సిద్ధాంత పరిచయము - నిర్గుణశాస్త్ర (Law of Non -possession) గోష్ఠి-

అందరకు పంచాయతీ పాలనలో ఒక సంవత్సరం అనుభవము యిప్పించాలి.

# ప్రభుత్వ పరీక్షా విధానం

(25 సం॥ వయస్సు నిండేలోపల)

## "సాధకుడు - నిపుణుడు" బిరుదులు

ఈ పరీక్షకు 35 వయస్సు వచ్చేవరకు సాధించవచ్చును. ఆపిమ్మట అవకాశం వుండనేరదు.

ప్రతివారు జీవితమంతా శిక్షణగానే భావించేలాగున ఉపదేశం పొందాలి. జీవిత నడకతో శిక్షణ నిలయంవారి ప్రణాళికనుబట్టి (1) 35 సంవత్సరములు వయస్సు వచ్చేనాటికి "యోగ్యుడు" అనే బిరుదున్నూ, (2) 55 సంవత్సరముల వయస్సు నాటికి "పూజ్యుడు" అనే తరగతినిన్నీ, సాధించుటకు కృషి చేయవలసి వుండునని హెచ్చరించవలెను. ఈ విధంగా శిక్షణ సాధించినవాడు 70 సంవత్సరములనాటికి మహాత్ముల గోష్ఠిలోకి చేరగలుగుతాడు. జన్మరాహిత్య గోష్ఠిగుర్తిస్తాడు. దీనికంతకు 25 సంవత్సరములలోపు శిక్షణ పునాది. జీవితపరిణామమును గురించి "గ్రామతత్వం" చదివి తెలుసుకోవలెను. 35 సంవత్సరముల వయస్సులోపల భాగవతము - గీత చదివి ఉపదేశముద్వారా ఆ తత్వం తెలుసుకోవలసివున్నదని బోధించవలెను. ఆనాటికి "అహింసావిధానము' మీద మనస్సు నిలిస్తే, ,అందునుగురించి ముందు పరిశోధనలు చేయవలెననియు, అట్లు నిలవనియెడల పరిశోధనలు ఆపి

చిక్కినవనరులతో కర్మవిధానము సాగించి, "అన్నోత్పత్తి"కి బహువిధము లయిన కృషిని పెంచుకోవలెననియు బోధించవలసి యుండును. దారితప్పుతే రాక్షసమాయలో పడతావని హెచ్చరించవలెను.

అనుభవయుక్తముగాని "వూహాప్రవీణత" రాక్షసమాయకు దింపుననికూడా పదే పదే చెప్పవలసివుండును. తను, తన తల్లి దండ్రులు, తన అన్నదమ్ములు, తన అక్కచెల్లెండ్రు తన భార్య కొడుకులు కూతుళ్ళు కోడళ్ళు అల్లుళ్ళు అనుభవము మీద అహింసా మార్గమున గుర్తించని విషయములు ఊహలవలన కలుగునట్లు నచ్చచెప్పవలెను.

ఉపాధ్యాయులు, ప్రబోధదీకులు ఉపదేశకుల కృషి యావత్తు, ఈ విధమగు సంపత్తును పెంచుటకు వినియోగపడవలసియుండును. ఛాన్సలరు, వైసుఛాన్సలరుల దీక్షమీద యీ పెంపు ఆధారపడివున్నది. అనుభవ యోగ్యులను సమకూర్చుకొని ఈ శిక్షణ పూర్తిచేయించవలసిన బాధ్యత వారియందు కలదు. కేవలం పుస్తక పరిశీలనతో ఆరితేరినవారు ఎంతటి మేధావంతులయినను అనుభవయోగ్యులు కానియెడల వారు యీ కార్యక్రమమును పెడమార్గము పట్టించుతారనే నమ్మకమును విద్యార్థులకు కలుగచేయవలసియుండును.

25 సంవత్సరములు నిండన ప్రతి విద్యార్థి 10 సంవత్సరము లలోపు విద్యార్థుల తరగతులను శ్రద్ధతో నడిపించి తామార్జించిన

జ్ఞానమును మననము చేసుకొంటూ తన బోధనాశక్తిని పెంపు చేయవలసియుండును.

తనముందు అభివృద్ధికి తానే బాధ్యుడగుననియు ఇందుకు విరుద్ధంగా గోచరించే అభిప్రాయములు తనలో గల "చింతన" పటుత్వలోటు వలన కలుగుచుండుననియు నిరంతర అనుకరణ, అభ్యాస శిక్షణ, తనను 55వ సంవత్సరం నాటికి విచక్షణావంతునిగా మార్చగలదనియు నచ్చచెప్పవలెను. విశ్వాసము గల విద్యార్థికి ప్రేమగల అధ్యాపకుడు చెప్పవలసిన నీతి ఇది. ఇది వర్ణించి, వ్రాసియిచ్చే పరీక్షతో అంతంకాదు. నిరంతర అభ్యాసముతో జీవిత లక్ష్యముగా ముందు సాధించుటకు పూనుకొనే దీక్షయందు కనపరచే శ్రద్ధగా దీనిని తెలుసుకోవలయును.

2) పట్టణములు - నగరములు పెరుగుటకు ఒక పరిమితి యేర్పడవెలు. జిల్లాకొక పట్టణహు రాష్ట్రమునకొక నగరము కంటె ఎక్కువ వుండరాదు.

1. పట్టణము ఒక లక్షజనంకంటెను నగరము అయిదు లక్షల జనంకంటెను మించి పెరుగనీయకూడదు.

2. పట్టణములలోను, నగరములలోను చేరు మనుష్యులు యొక్క అర్హతలు విచారించుచుండవలెను. గ్రామానుభవము కలిగియుండుట, ప్రధానార్హతగా నిర్ణయించవలెను.

3. గ్రామాదులలో తయారుఅగుటకు అవకావములేని పరిశ్రమలు పెద్ద పాఠశాలలు, పెద్ద న్యాయస్థానములు, పెద్ద ఆసుపత్రులు పరిశోధనలు పరిపాలన కూటముల మొదలగు విజ్ఞాన సాంప్రదాయక, వర్తక, సంస్థలతోకూడిన ప్రదేశములుగా యీ నగరముల వుండి గ్రామాదుల సహకారమును పొందుచూ, గ్రామములకు సహాయమును యిచ్చునవిగా నిర్మితము కావలెను.

3. ప్రజలలో అన్న - వస్త్ర - గృహోత్పత్తి సందర్భముననను, వాటి వినిమయముల సందర్భముననను గ్రామాదులలో వస్తుమార్పిడి విధానమును అమలులోకి తేవలెను. ప్రత్యక్ష బంగారు ప్రమాణంతో కూడిన నాణె విధనాము వుంచుకోవలెను. పట్టణ - నగర ప్రాంతములలో ప్రభుత్వ శాసనముల క్రింద పాలించబడే జనాభామీద తలకు రు. 2లకు మించిన నాణెమును వాడుకకు పెట్టకుండా యేర్పాటు కావలెను.

4) మానవ జీవితమునకు అవుసరమగుయంత్రనిర్మాణము ప్రభుత్వ స్వాధీనంలో వుంచుకొనవలెను.

5) వ్యక్తిగా ఆస్తులయందు హక్కుకోరక అధికార మమకారములు వదలి మానవాభ్యుదయమే ఈశ్వరసేవగా యెంచి కృషిచేయు అనుభవశాలురసంఘమును యేర్పాటు చేయించి వారి సలహాలతో చట్టనిర్మాణము జరిగించుచుండవలెను. వీరిద్వారా ప్రపంచసభలు ప్రపంచ కళాశాలలు యేర్పాటు చేయించి ప్రపంచశాంతికి తోడ్పడవలెను.

6) భారతదేశములో సైస్థితిని సుస్థిరముగా స్థాపించి తొట్రుపాటుపడకుండా నిలపెట్టుటకును ప్రపంచములో అన్ని దేశములవారిని ప్రోత్సహించి సైస్థితిని స్థాపింపచేయుటకును, నిలబెట్టించుటకును, సర్వహంగులూ కలిగిన భారతప్రభుత్వం యేర్పాటు కావలెను.

సైస్థితికి విరుద్ధంగా పెరుగుచుండే కలుషితమునంతను మూరు సంవత్సరముల కొకసారి సంస్కరించుకుంటూ యుండవలెను. ఇదే వికేంద్రకరణ - కేంద్రీకరణ సిద్ధాంత సమన్వయముతో కూడిన నిర్మాణ విధానము.

# ఆదర్శ గ్రామము

## (మాదిరి కొరకు)

1) గ్రామము - వెయ్యి జనాభా - అంటే 200 కుటుంబములు వెయ్యి యకరముల భూమి గలిగినది.

2) ఇట్టి గ్రామమునకు సాలీనా కావలసిన వస్తువులు.

1. మూడువందల టన్నుల ఆహార ధాన్యములు 180 టన్నుల పాలు.
2. పదిహేను వేలగజాల గుడ్డ.
3. వెయ్యి మణుగుల నూనెలు.
4. వెయ్యి మణుగుల బెల్లం.
5. వెయ్యి చెప్పుల జతలు, యిత్యాదులు.

3) పైన చెప్పిన వుత్పత్తికొరకు,

1. అరువది అరకలు
2. పది బళ్ళు
3. నూరు పాడి ఆవులు.
4. నూరు పాడి గేదెలు.
5. రెండు చెరువులు - ఇరువది బావులు.

4) గ్రామములో నూటికి 50 పాళ్ళ భూమి వరి, రాగి - గోధుమ కొన్న అపరాలు నూనెగింజలు యిత్యాది ఆహారపదార్థముల

కొరకున్నూ, ప్రత్తిక్రిందను, 20 పాళ్లు బీడు, అడవి, 10 పాళ్లు తోటలుగాను, 2 పాళ్ళు కూరల క్రిందను 2 పాళ్ళు యెగుమతి సరుకులకును 16 పాల్లు అత్యవుసరముకును, నియమించబడివలెను.

5) ప్రతి కుటుంబమునకు ఒక పాడి పశువు ఒక తిరుగలి ఒక రాటము వుండునట్లు చూడవలెను.

6) జనాభాలో నూటికి;

40 పాళ్ళు వ్యవసాయంద్వారా ఆహారము గుడ్డ మొదలగు వృత్తులకు ముడిపదార్థముల వుత్పత్తికిని, 40 పాళ్ళు పరిశ్రమలద్వారా గుడ్డ - నూనెలు వడ్రం - కమ్మరం - పాత్రలు - యిత్యాదిచేతి పరిశ్రమములు తరతరముల అనుభవంతో నిపుణత్వమును పెంచేలాగున వుత్పత్తికిని. 20 పాళ్ళు రక్షణ, విజ్ఞానము, వ్యాపారం లెఖ్ఖలు ఆరోగ్యం, శిక్షణ అంటే 200 మంది విద్యార్థులకు శిక్షణ ఇచ్చుటకును వయోజనవిద్య కొరకున్నూ ఉపయోగపడునట్లు చేయవలెను. స్వయంపోష్యం స్వయం ఆధారములమీద స్వంత జవాబుదారీతో ప్రతి కుటుంబము ఆరాటపడునట్లు చూడవలెను. గ్రామ వుమ్మడి కృషికి వదలరాదు. సంపత్తు పెరుగనట్టి జ్ఞాన విజ్ఞాన విషయములను ద్రవ్యార్జన నిలవలకు ఆరాటపడనివారికి అంటకట్టుచుండవలెను. ఈ రీత్యా గ్రామ స్వపరిపాలన పెంచి ప్రభుత్వ అనుబంధము తగ్గించవలెను.

7) గ్రామం మొత్తంమీద 200 కోళ్ళు 300 మేకలు గొర్రెలు 50 పందులు పెరుగుచుండునట్లు చేయవలెను. చెరువులలో చేపలు పెరుగునట్లు చూడవలెను. ఎరువులకును తిండి నిమిత్తమున్నూ, యీ కృషి జరుగుచుండవలెను.

8) గ్రామమొత్తంమీద యీ దిగువ చెట్లు సౌష్ఠవంగా పెరుగుచుండునట్లు చూడవలెను. 25 నిమ్మ, 50 నారింజ, 25 దబ్బ, 50 బత్తాయి, 50 సపోటా, 25 కమలా, 100 మామిడి, 50 కొబ్బరి 6000 అరటి 25 చింత 200 తాడి 500 ఈత, 2000 తుమ్మ, 10000 సరుకుచెట్లు భూమియొక్క సారమునుబట్టి విచక్షణతో పెంచుచుండవలెను.

9) గ్రామములో ఒక స్టోర్సు వుండాలి. గ్రామానికి మిగిలే సరుకులు యెగుమతీ చేయుటకు, తరుగు అయ్యేసరుకు దిగుమతి అగుటకు ఆ స్టోర్సు వినియోగపడాలి. ప్రతి వ్యక్తి యెగుమతి, దిగుమతులు చేయుటకు అవకాశం వుండరాదు.

10) గ్రామంలో 750 బస్తాల ధాన్యం మూలధనంతో ఒక ధాన్యం బ్యాంకున్నూ, 7500 విచ్చెల మూలధనంతో ఒక నూలు బ్యాంకున్నూ యేర్పడాలి. సాలు శ్రమకు 15 బస్తాలు మొదలు 621/2 బస్తాల వరకు ప్రతిఫలం వుండాలి. సామాన్య కృషికి రోజుకు 4 పౌన్లు ధాన్యమున్నూ,

జవాబు దారీతోకూడిన నిపుణత్వపనికి రెట్టింపున్నూ, ప్రతిఫలం గిట్టేట్లు చేయాలి. ఒక నూలు విచ్చెకు 120 తులా వంట పదార్థము ప్రతియింటిలోను ముట్టేలాగు ఆచారం యేర్పాటు చేయాలి,

840 గజాల నూలువిచ్చెకు యీ దిగువవాటిలో యే ఒక్కటిగాని గ్రామవుత్పత్తి కుటుంబ అవసరములకు వినిమయమయ్యేలాగు చేయాలి.

| | | | |
|---|---|---|---|
| 1. బియ్యం | 60 తులాలు | - 12. బెల్లం | 24 తులాలు |
| 2. గోధుమ | డిటో | - 13. నూనెలు | డిటో |
| 3. అపరాలు | డిటో | - 14. కూరలు | 240 తులాలు |
| 4. పాలు | డిటో | - 15. అన్నం | 120 తులాలు |
| 5. జొన్నలు | 80 తులాలు | - 16. ఖాదీ | 1/7 గజము |
| 6. రాగి | డిటో | - 17. నిమ్మ | 24 |
| 7. మొక్కజొన్న | డిటో | - 18. నారింజ | 8 |
| 8. వడ్లు | డిటో | - 19. బత్తాయి | 4 |
| 9. ఉప్పు | 100 తులాలు | - 20. కొబ్బరికాయలు | 2 |
| 10.మిర్చి | 12 తులాలు | - 21. సపోటా | 20 |
| 11. చింతపండు | 24 తులాలు | - 22. అరటి | 20 |

గ్రామ బ్యాంకులద్వారా హుండీలు, టికట్లు పెట్టి నమ్మకంగాను, సులభంగాను యీ మార్పిడి విధానంను గ్రామస్థులు తమలో తాము

మార్చుకొనగలరు. ఇదే ఆఖరుకు ఉత్పత్తిదారుకు తినేవారికి మధ్య దళారీలు లేకుండా ప్రత్యక్ష వినిమయంకు ప్రోత్సాహం చేయును. ఈప్లాను రీత్యా గ్రామంయొక్క లావాదేవీలలో నూటికి 75 పాళ్ళు స్థానికంగాను 10 పాళ్ళు ఫిర్కానుంచిన్ని 10 పాళ్ళు జిల్లా నుంచిన్ని 3 పాళ్ళు రాష్ట్రంలో నుంచిన్ని 2 పాళ్లు రాష్ట్రేతరం నుంచిన్ని వస్తుమార్పిడిన సమకూరగలవు.

గ్రామాలను పంచాయితీ పద్ధతిని పాలించవలెను. యుక్తవయసు' వచ్చిన స్త్రీ పురుష ఎన్నికలవలన 35సం॥ వయస్సుకు మించిన అయిదుగురు తగ్గని అర్హులుతో కూడిన ఈ పంచాయితీ యేర్పడవలయును. అధ్యక్షుడు ఆర్జన విరమించినవారుగా ఉండాలి. ఈ పద్ధతి మానవునిలో సహజంగా యేర్పడివుండే కాంక్ష ప్రబలంకాకుండా పరస్పర సహకారంకు దింపుచుండగలదు.

ఇక ప్రభుత్వం వలన

1) కరెన్సీ పద్ధతిన కాకుండా వస్తురూపకంగా గ్రామ మొత్తంమీద పన్ను తీసుకొనేలాగు
2) మంచిరకపు విత్తనములు - నిపుణులు - ఆంబోతులు ఇత్యాదులు సప్లయి జరిగేలాగు
3) ప్రజలకు పోలీసు శిక్షణ యిచ్చేలాగు
4) అయిదుగురికి తక్కువకాకుండా తమ శిబ్బందిలోకి తీసుకొని అనుభవం యిచ్చి గ్రామానికి పంపుతూ ఉండేలాగు

5) తాలూకాలలోను, జిల్లాలలోను ధాన్యం బ్యాంకులు, నూలు బ్యాంకులు పెట్టి అవసర సమయములలో గ్రామాలకు సహాయం చేసేలాగు

6) పరాయి దండయాత్రలు లేకుండా చేసేలాగు

7) ఈ పరిస్థితులు అమలులోకి వచ్చుటకు అవసరమయిన అన్ని శాసనములు చేసేలాగు చూడాలి.

ప్రపంచమంతా ఒక్క గ్రామంలో చూడాలని ఆరాటపడే పరిశోధకులు అనుభవముతో అభివృద్ధికి మార్గములు చూపించుతారు.

పనిముట్లు

1) నాగలి - బండి - సామానులు.

2) రాటం - మగ్గం సామానులు.

3) రోకలి - తిరుగలి - రోలు సామాన్లు.

4) పలుగు - పార - గొడ్డలి - కొడవలి సామాన్లు.

5) వడ్రం - కమ్మరం పనిముట్లు.

6) గానుగ - కుట్టుపరిశ్రమకు - పనిముట్లు

7) రంగుల పరిశ్రమ - పనిముట్లు.

8) వైద్య విధానము.

9) శిక్షణ విధానము.

10) రక్షణ విధానం పనిముట్లు.

# గ్రామ శాకాహార వివరములు

**సూచన :** వీటి గుణములు - సృష్టిలోని ఇతరసంపదను - వాటిని సమృద్ధిగా ఉత్పత్తిచేయు విధానము - ఆరోగ్యాభివృద్ధి కొరకు కాలమానము గుర్తెరిగి పొదుపుగా వినియోగించు పద్ధతులను శిక్షణ పొదువారికి పాఠ్య కార్యక్రమములో ఇమిడ్చి చెప్పవలెను. పరిశోధనలతో గ్రహించునట్లు చేయవలసి వుండును.

## ధాన్యాలు

1. వడ్లు, 2. గోధుమ, 3. జొన్న, 4. మొక్కజొన్న, 5. తమిద, 6. వరిగె, 7. సజ్జ, 8. కొర్ర, 9. అరిగెలు, 10. అలచందలు వగైరా.

## అపరాలు

1. కందులు, 2. పెసలు, 3. మినుములు, 4. శనగలు, 5. వులవలు వగైరా.

## పండుజాతి

1. తాటిపండు, 2. కొబ్బరికాయ, 3. మామిడిపండు, 4. అరటి, 5. అనాస, 6. పనస, 7. జామ, 8. చింత, 9. నిమ్మ, 10. దబ్బ, 11. నారింజ, 12. బత్తాయి, 13. జీడిమామిడి, 14. కమల వగైరా.

## దుంపజాతి

1. చిలగడం, 2. కంద, 3. పెండలం, 4. చామ, 5. బంగాళాదుంప, 6. ఉల్లిపాయ, 7. ముల్లంగి వగైరా

## నూనెజాతులు

1. నువ్వులు, 2. వేరుశనగ, 3. అవిశె, 4. కొబ్బరి, 5. ఆముదం వగైరా.

## కాయకూరలు

1. పొట్ల, 2. కాకర, 3. గుమ్మడి, 4. సొర, 5. చిక్కుడు, 6. వంగ, 7. దొండ, 8. బెండ, 9. మిర్చి, 10. బీర, 11. దోస వగైరా.

## ఆకుకూరలు

1. తోటకూర, 2. బచ్చలి, 3. గోంగూర, 4. చిట్టింట, 5. ఎలికజీడి, 6. గల్జేరు, 7. మెంతి, 8. ధనియం (కొతిమేర) 9. పాదినాకు వగైరా.

## చెట్లు

1. వేప, 2. అవిశె, 3. తుమ్మ, 4. టేకు, 5. నేరేడు, 6. ములగ, 7. రావి, 8. మర్రి, 9. ఈత, 10. తాడి, 11. సరుకు, 12. వెదురు, 13. సీకాయ, 14. కుంకుడు, 15. బాదం మొదలైనవి.

## ఓషధులు

1. తెల్లజిల్లేడు, 2. నల్లఉమ్మెత్త, 3. చిత్రమూలం, 4. అల్లం, 5. మిరియం, 6. వెల్లుల్లి, 7. తేనెపట్టు మొ॥నవి.

## పుష్పజాతి

1. మల్లె, 2. గులాబి, 3. చామంతి, 4. బంతి, 5. గన్నేరు, 6. దవనం, 7. మరువం, 8. రుద్రజడ, 9. జాజి, 10. సంపెంగ, 11. మందార వగైరా.

పూజార్హత

1. తులసి, 2. దేవాలయం.

సూచన : దేవాలయాధికారులు - పుష్పజాతి - ఓషధులు, చెట్లు, ఫలవృక్షములు - కూరకాయల విధానము - చేవృత్తుల విధానము - వైద్య విధానము , శిక్షణ విధానముల వంటి ప్రత్యేక బాధ్యతలు పెట్టుకొని అన్ని కుటుంబములద్వారా స్టోర్సు అనుబంధముతో అమలు జరిగేలాగు ఈ ప్రణాళిక నడిపించవచ్చును.

రక్షణ నిలయంవారు ముడి పదార్థ వుత్పత్తికిన్ని రక్షణకున్నూ ప్రత్యేక బాధ్యత వహించగలరు.

విజ్ఞాన నిలయంవారు కేంద్రీకరణ - వికేంద్రీకరణలకు సమన్వయ విధానము చెడకుండ చూస్తూ వుండుట అవుసరం.

## పాడివసతులు

1. ఆవు, 2. గేదె, 3. మేక వగైరా.

## పచ్చిగడ్డి వివరములు

1. కలివేరు, 2. మొలవ, 3. పిల్లిపెసర, 4. గరికె, 5. చిప్పర.

# గ్రామ మాంసాహార వివరములు

1) చెరువులలో పెంచబడుచుండే అనేక రకములగు జలచరములు.

2) గ్రామబంజరులలో పెరుగుచుండే అనేక పక్షి మృగజాతులు.

3) గ్రామంలో పెరుగుచుండే అనేకరకములగు పక్షిజాతులు.

4) 6 నెలలు వయస్సురాగానే సాలుకు రెండు ఈతలు తడవకు 2 పిల్లలు కలుగుచుండే గొర్రెజాతి.

5) సాలుకు 150 గ్రుడ్లువరకు పెట్టుచుండే కోడిసంతతి.

6) ఆరునెలల వయస్సు రాగానే సాలుకు 10 పిల్లలవరకు వృద్ధి అయ్యే పంది సంతతి.

7) ప్రమాదవశమున మరణించుచుండే పశుసంతతి - దీనిని గురించిన వివరములకు జోగన్నపాలెం గ్రామ నివేదిక చూడవచ్చును.

# గ్రామ పరిశోధన విధానము

1) గ్రామ చరిత్ర వివరాలు.

2) భూవసతి - వైఖరీ - సారము - సాగు.

3) పశువులసంఖ్య - పశువువైఖరీ - పాడి - పడకస్థితి.

4) వృక్షవవరు - గడ్డివనరులు.

5) జనాభా - కుటుంబములు - కులములు - ఆచారములు - స్త్రీలు - పురుషులు - పిల్లలు - వయస్సువారీగా.

6) కుటుంబవసతులు - స్థితివంతత్వం - బీదరిక పరిస్థితులు - హక్కులపద్ధతి - వృత్తుల విధానంయొక్క వివరాలు స్థూల సూక్ష్మ వివరములతో - ఉత్పత్తి - వినిమయములు ఆదాయ - వ్యయముల వివరములు -

7) ఆహార వివరాలు - ఉత్పత్తి వివరం - శాకాహార, మాంసాహార వివరములు - వాటికి వున్న ఆధారములు -

8) బావులు - చెరువులు - ఆరోగ్య వివరములు -

9) శిక్షణ విధానము - నీటి వనరులు - రక్షణ విధానము -

10) నైతిక - సాంఘిక - ఆర్థిక వివరములు

11) గ్రామంలో వస్తుమార్పిడి విధానం - సర్కారు సంబంధ వివరములు - పాలన విధానము.

12) సఖ్యతను గురించిన వివరములు. సాముదాయకమైన పనుల వివరములు.

13) కనిపెట్టబడిన లోట్లు.

14) నివారణోపాయములు.

15) మార్గ సౌకర్యాలు - బాహ్యా దేశ సంబంధాలు.

16) జ్ఞానవిజ్ఞాన సంపత్తు.

జోగన్నపాలెం నివేదికను ఆధారము చేసుకొని పరిశోధనలు జరిగించాలి.

16 సంవత్సరముల వయస్సు లోపువారిని శిక్షణనిలయం క్రిందను, 25 సం॥ల లోపువారిని గ్రామ విశ్వవిద్యాలయం క్రిందను, 35 సం॥ల వయస్సులోపువారిని రక్షణ నిలయం క్రిందను, ఆ పై వయస్సువారిని విజ్ఞాన నిలయంక్రిందను చేర్చుకుని ఆయా బాధ్యతలు నిర్వహించాలి. గ్రామస్వయంపోష్యం - స్వరక్షణ-స్వపరిపాలన జరిగే లాగున పరిశోధనలు ఉపయోగపడాలి.

# గ్రామ వృత్తుల ప్రణాళిక

| | | |
|---|---|---|
| 1) | వ్యవసాయం - పశుపోషణ - | నూటికి 40 పాళ్ళు |
| 2) | నేత పరిశ్రమ<br>(వడుకుట - యేకుట - కుందికసరతు -<br>పాడివనరు - ఇంటిదొడ్డికూర అందరకూ<br>సమాన బాధ్యత) | " 10 " |
| 3) | నూనెల పరిశ్రమ | " 2 " |
| 4) | గృహనిర్మాణపరిశ్రమ - వెదురుపరిశ్రమ | " 2 " |
| 5) | మట్టితో పరిశ్రమ - లోహపరిశ్రమ -<br>కొయ్య పరిశ్రమ | " 2 " |
| 6) | రంగుల పరిశ్రమ | " 1 " |
| 7) | చర్మపరిశ్రమ | " 2 " |
| 8) | వైద్య విధానం | " 2 " |
| 9) | శిక్షణ విధానం (ఉపాధ్యాయ) | " 5 " |
| 0) | వినిమయ విధానం | " 2 " |
| 1) | రాకపోకల విధానం - స్టోర్సు విధానం | " 2 " |
| 2) | పాలనవిధానం - రక్షణ విధానములు | " 5 " |
| 3) | రక్షణ విధానము | " 5 " |
| 4) | విజ్ఞాన విధానం - పంచభూత పరిశోధన | " 2 " |

| | | |
|---|---|---|
| 15) | జ్ఞాన విధానం - గుణత్రయ పరిశోధన | " 2 " |
| 16) | ఇతర గ్రామ ఉద్యోగములు | " 8 " |
| | మొత్తం | 100 పాళ్ళు |

ఇది గ్రామ నాగరిక జీవితకృషికి చుక్కాని వంటిది.

ఇట్లుగా గుర్తించి పరిశోధన చేయాలి. ఏ వ్యక్తి దురాచారుడైనప్పటికి క్రమేణా గ్రామ మంతటికి ముప్పు తెస్తాడనే సమిష్టి బాధ్యతను గుర్తింపచేయాలి. కల్తీలు - మోసములు లేకుండా చేయుటకు ఈ విచక్షణ అత్యవసరము. స్థానిక మానవ అవసరములు తెలుసుకోకుండా వుత్పత్తి చేస్తే ఆ సరుకు యొక్క వినిమయముకొరకు వ్యాపారపుతంతు ప్రవేశిస్తుంది. అది దురాశకు దింపుతుంది. దానితో ముందుగా గోభూమి నశించి భూమధన హెచ్చుతుంది. పవువు నశించిన యెరువు వుండదు. పాడి వుండదు. క్రమేణా వ్యాపారసరుకుల ఉత్పత్తికి ప్రాముఖ్యత కలిగి స్వయంపోష్యం - స్వశక్తి - గ్రామస్వరాజ్య శిక్షణలకు కీడు వాటిల్లును. దిగుమతి యెగుమతులతో విచక్షణ పోతుంది. కరెన్సీ సంకెళ్లకు చిక్కి గ్రామస్తులు పరాధీనులైపోతారు. వర్గవివాదాలు పెరుగుతవి. దళారులు పెరుగుతారు. అందుచే ఈ ప్రణాళికను బహుజాగ్రత్తగా గుర్తించి విద్యార్థులకు బోధించుచు దీనిని మంచి తూనిక పద్ధతిగా సాగించవలసియుండును.

# ̧ామ విశ్వవిద్యాలయము

శాశ్వతంగా, ఆర్థిక జవాబుదారీ వహించి నైతిక-సాంఘిక విధానములకు బాధ్యులై ఉండే శాశ్వత హంగు.

కొన్ని షరతులతో శాశ్వతంగా తోడ్పడువారు.

వీలువెంబడి ఆర్థిక సహకారం చేయువారు. ఉచితసేవ వీలువెంబడి యిచ్చువారు.

నిబంధనలను అనుసరిస్తూ ఆర్థికవనరు పొందుతూ తమ తమ వీలువెంబడి షరతులు కుదుర్చుకుని సేవచేయువారు.

శిక్షణ పొందేవారిని కూడా పై తరగతులు గమనించే లాగున ◌లిసియుండును. వీరి బాధ్యతలు వివరంగా నిర్వఇచంచాలి. ◌ు స్పష్టపరచాలి.

35 సంవత్సరముల వయస్సుగల దీక్షాపరులు యెంతవరకు సమకూడినదిన్నీ, 'గ్రామ స్వరాజ్య' శిక్షణ పూర్తి చేసినవారు ఎంతమంది శిక్షణ పొందుచున్నదిన్నీ గుర్తించి దీని అభివృద్ధిని గమనించుచుండవలెను.

# ప్రభుత్వ చట్టము

26-1-1950 తేదీన భారతరిపబ్లికు యేర్పాటయినది. అందు భాషాప్రయుక్తరాష్ట్రములకు తావులేదు. మొదట్లో ఆ చట్టమంతా గ్రామ స్వరాజ్యమును రూపుమాపుటకు తయారు చేయబడివుంది. అయితే సంఘర్షణ తప్పుకొనుటకు ఆ చట్టము యొక్క 40వ ఆర్టికలు ద్వారా గ్రామపంచాయితీలను గురించి వప్పుకొన్నాను. తీవ్ర చర్య వుంటేకాని ఇది అమలులోకి రాదు. ఇందుకొరకు తగిన ప్రబోధం చేయుటకు తగిన రాజకీయపార్టీ యేర్పాటు కావలెను. ఇందులోనుంచి అనేక సుగుణములు వస్తవి. భాషా ప్రయుక్తరాష్ట్ర నిర్మాణమును పేరుతో వుద్యమము నడుపుటకన్న గ్రామపంచాయతీలని నడుపుట చట్టబద్ధమై వుండగలదు. భాషామండలములని పేరు పెట్టి భాషా వ్యాపకం చేయించనగును. గ్రామ పంచాయితీలద్వారా యిప్పటి రాష్ట్ర ప్రభుత్వము ఆవశ్యకత తగ్గించవచ్చును. కేంద్ర ప్రభుత్వ బాధ్యతలు సులభం చేయవచ్చును. ఈ దృష్టితో 40వ ఆర్టికలుకు అనుగుణ్యముగా రిపబ్లికు చట్టమును సవరణ చేయాలి. ఈ ఒక్క ఆర్టికలుకు మాత్రం వికేంద్రీకరణ సిద్ధాంతమునకు సంబంధించివుంది. మిగతా చట్టమంతా కేంద్రీకరణ పెంపుకొరకు వుద్దేశించబడివుంది. ఈ పరిజ్ఞానమును గుర్తించి వ్యాపింపచేయవలసివున్నది.

# వికేంద్రీకరణ రాచకీయ పార్టీ విధానము

1) వికేంద్రీకరణ సిద్ధాంతము ననుసరించి 1950 సం॥ 26వ జనవరి రాజ్యాంగముయొక్క 40వ ఆర్టికలు ఆధారంతో గ్రామ పంచాయితీ విధానం అమలు జరిగించుటకును, ఆ చట్టమునందుగల వ్యతిరేకవిధానమును సవరింపచేయుటకును రాజకీయ పార్టీ యేర్పడవలెను.

2) ప్రతి గ్రామములోను, ప్రతిపట్టనము నగరముల యొక్క ప్రతివార్డులోను వోటర్లసంఘములు పెట్టి వాటిద్వారా అర్హులగు అభ్యర్థులను యెన్నుకొని శాసనసభలలోను ఇతర అనుబంధ సంఘములలోను పంచాయితీ పద్ధతిమీద సర్వబాధ్యతలు నిర్వహించే లాగు చూడాలి.

3) ఇందుకొరకు శిక్షణగల 25 సంవత్సరముల వయస్సు మొదలు 45 సంవత్సరముల వయస్సు మధ్యగల వారలకు పదిహేనురోజులు - నెలరోజులు వంటి రాజకీయ తరగతులు పెట్టి కర్తవ్యం గూర్చి ఉపదేశం పొందునట్లుగా ప్రబోధం చేయించవలయును.

4) విదేశములలో కృషి చేయుటకు అనుభవముగల అర్హుల యొక్క జాబితా తయారు చేయించి అందులో వున్నవారిలో నుంచి ప్రభుత్వం యేరుకొని పంపేలాగు చేయాలి.

5) గ్రామ - ఫిర్కా - తాలూకా - జిల్లా - పంచాయితీలు యేర్పరచి భాషామండలముల ఆధారముతో రాజ్య పరిపాలన నడుపుటకు పూనుకొనవలెను.

6) ప్రభుత్వం ప్రత్యక్ష బంగారు ప్రమాణంతో కూడిన నాణె విదానం అమలుచేయాలి. కాగితాల కరెన్సీ బాధ్యతలు రద్దు చేయాలి.

7) గ్రామ పంచియితీలు యోజన వోటింగు మీద అర్హతగల 35 సంవత్సరముల వయస్సుకు మించిన అభ్యర్థులను యెన్నుకొనేలాగు యేర్పడవలెను. ప్రతి గ్రామములోను అభ్యర్థులుగా ఉండ నర్హులయిన వారి జాబితా తయారగుతూ వుండాలి. వారు ఫిర్కా - తాలూకా - జిల్లా - రాష్ట్ర సంఘములకున్నూ శాసనసభలకున్నూ అర్హతగల అభ్యర్థులను ఎన్నుకొనేలాగు చేయాలి.

8) అభ్యర్థులయొక్క అర్హతలు నిర్ణయించుటలో విచక్షణాజ్ఞానము ఓటర్లలో వృద్ధి చేయవలసియున్నది. సగుణశాస్త్రము (Law of possession), నిర్గుణ శాస్త్రము (Law of Nuon-possession) లను వాటిసమన్వయమును గ్రహించినవారుగా ఉండాలి. మానవసృష్టి

చిత్రమును గుర్తించినవారుగా ఉండాలి. గుణంచేతను, శరీరంచేతను తోటి మానవునికి చెరుపు కలుగని విధానం అమలుజరిగించవలసి వున్నదని గుర్తించాలి. ప్రజాబాధ్యతలు నిర్వహించుటకు యీ పరిజ్ఞాన అనుభవము గ్రామపంచాయితీ మొదలు శాసనసభలవరకు వర్తింపచేయతగినదిగా నచ్చజెప్పవలయసియుండును.

9) గ్రామస్వయంపోష్యం - స్వరక్షణ - స్వరిపాలనలకు బాధ్యత పెట్టి గ్రామస్తులకు గ్రామ స్వరాజ్య శిక్షణ ప్రధాన బాధ్యతచేసి నడిపించాలి. మాదిరి ప్రణాళికను అనుసరించాలి. ప్రభుత్వం ఈ శిక్షణ విధానమును అమలు పరచాలి.

10) గ్రామంలో ధాన్యపుబ్యాంకులు -నూలు బ్యాంకులు పెట్టి గ్రామస్థులను కరెన్సీ సంకెళ్ళనుండి విముక్తి చేయాలి.

11) ఫిర్కాలోపలి పరిపాలన అంతా వికేంద్రీకరణ సిద్ధాంతం క్రిందను, ఆపై పరిపాలన కేంద్రీకరణ విధానము క్రిందను నడిపించాలి. దురాక్రమణ - దండయాత్రలు - కరువులు నివారించుటకు ప్రభుత్వం పూనుకోవలెను. వికేంద్రీకరణము క్రింద తయారుకాజాలని ఉత్పత్తి నంతను ప్రభుత్వం కేంద్రీకరణ విధానము క్రింద ఉత్పత్తి చేయాలి. ఈ నిర్మాణమును కాపాడుటకు స్వయంపోష్యశక్తితో కూడిన సైన్యశిక్షణ పెంచి బలిష్ఠమయిన ప్రభుత్వము యేర్పాటు చేయాలి,

12) వికేంద్రీకరణ పాలనలో వస్తుమార్పిడి విధానము నమలు జరపాలి. కేంద్రీకరణ పాలనలో తలకు రు.2-0-0 లు మించిన కరెన్సీ అమలులో పెట్టకూడదు. ప్రస్తుత కాలములో ప్రజల శాంతినంతను తారుమారు చేస్తున్నది ఈ కరెన్సీ విధానమే అయి ఉన్నది. మారణయంత్రములు ఆటంబాంబులు కూడ ఇంత అశాంతిని కల్గించజాలవని నచ్చచెప్పుటకు తగిన బోధ ప్రతివారికి యిప్పించి ఆ ప్రమాదము తొలగించు కొనుటకు హెచ్చరించవలెను.

13) అఖిలభారత వోటర్లసంఘము ఏర్పడి దాని కార్యనిర్వాహక వర్గములో ఎన్నడూ ప్రభుత్వ ఎన్నికలకు అభ్యర్థులుగా నిలువని నిర్గుణశాస్త్ర ప్రవీణత (Pledged to Non-possession) గల అర్హులు ఎన్నికద్వారా యేర్పడి ప్రజల తరపున యెన్నికల వ్యవహారం నడిపించేలాగు చేయవలెను.

14) భారతదేశపు ఇప్పటి పార్లమెంటుకు "గాంధి కాంగ్రెసు" అని పేరు పెట్టవలయును. గ్రామ ప్రభుత్వములు, భాషా ప్రయుక్త మండలములు యేర్పాటుచేసి ఇప్పటి రాష్ట్ర ప్రభుత్వములు తగ్గింపబడవలెను.

15) ప్రపంచశాంతి సాధించుటకున్నూ, సత్యాగ్రహము నడిపించుటకున్నూ (Non-possession pledge) తీసుకొన్నట్టి నిర్గుణశాస్త్ర ప్రవీణులతో కూడిన అహింసా కార్యసంఘము (Ahimsa Action Council) ఏర్పాటు చేయవలెను.

16) నైతిక-సాంఘిక-ఆర్థిక విధానములన్నియు ఇందుకు అనుగుణ్యముగా నడుచుటకు శాసనములు యేర్పడవలెను. ఇందుకు విరుద్ధంగా వున్న వాతావరణమును ఛేదించాలి. ఇందుకొరకు ఈ రాజకీయముతా కృషి చేయాలి. మతతత్వము అంతా ఇందుకు అనుగుణ్యముగా ఉందని అన్వయము చేసుకొనవలెను.

# మానవ సృష్టి చిత్రము

మానవులలో మగ - ఆడ తెగలున్నవి. వీరి చిత్తవృత్తులు వేరు వేరుగా వుంటవి. అంగ నిర్మాణము వేరుగా ఉండును. ఆడవారిలో నిబ్బరము - తెంపు - మమకారములు హెచ్చుగా వుండును. అవి మగవారిలో తక్కువ. యే ఒక్కరూ స్వతంత్రముగా నాగరిక జీవితమును పూర్తిగా అనుభవింపజాలరు. పెంపు చేయజాలరు. అందుకని యిద్దరు కలసి ఒక Unit అని లేక పురుషుడు అని నిర్మాణవిధంలో యేర్పడి వుంది. గ్రామ జీవితములో గృహస్తుమీద వుండే బాధ్యత గృహస్తు కానివారిమీద వుండదు. Unit నుండి విడిపోయినవారికి ఆ బాధ్యత గుర్తెరుగనివారికి విచక్షణారాహిత్యం వెంటాడును. వారిమీద బాధ్యత పెట్టకూడదు.

మానవునకు తీరిక కాలము హెచ్చుగావుంటే దానిని దుర్వినియోగం చేసే అవకాశం వుంటుంది. ఇతనికి తోటివారి కంటె తాను ఆధిక్యతగా వుండాలనే కాంక్ష తొట్రుపాటు చేస్తూ వుంటుందని "గ్రామతత్వం" వివరిస్తోంది. స్వావలంబన కొరకు తన కాలము వినియోగించుట యందు మానవునకు వికాసము, నిపుణత్వము కలుగజేస్తుంది. తీరిక హెచ్చుగా కలుగజేసి వినోదము భోగములతో ఆ తీరిక కాలాన్ని మనో వికాసము కొరకు వినియోగించవచ్చుననుట వట్టి భ్రమ, మోసం.

మానవులందరకు బాల్యము, యౌవనము, కౌమారము, వార్ధక్యము అను దశలు వస్తుండును. ఒకదశలో ఉండే మనస్థితి మరొకదశలో మారిపోతూ వుంటుంది. త్రిగుణములు వీరిని తారుమారు చేస్తూ వుంటవి. వీరి జీవిత కాలములో 15 సంవత్సరములలోపు కాలమును కృతయుగకాలముతోను, 25 సంవత్సరములలోపున వయస్సును త్రేతాయుగకాలముతోను, 55 సంవత్సరములలోపు వయస్సును ద్వాపరయుగకాలముతోను, ఆ పై కాలమును కలియుగము తోను వర్తింపజేయవలసి ఉన్నది. ఈ రహస్యము తెలుసుకొని ఈడుకుతగిన శిక్షణతో జాగ్రత్త పడనివారలు 55 సం॥ల వయస్సు అనంతరం కలియుగప్రాప్తితో దుఃఖములకు లోనైపోయెదరనుట స్పష్టము. వీరిలో ఉత్పత్తి శిక్షణలకు దోహదం చేయకుండా దానిని వదలి ఏదో ముక్తి సాధించుదామనే దురాకాంక్ష ప్రబలుతుంది. దీనితో దుర్భలులైపోతారు.

మానవుడు తనను తాను తెలుసుకొనుట దుర్లభమైన పని.అతనికి వుండే చింతనశక్తి అతనిని నడుపుచుండును. మనోవాక్కాయ కర్మలద్వారా చేసే పనులనుబట్టి అతని చిత్తవృత్తి తేలుతూ వుంటుంది. మనోవాక్కాయకర్మల మూటియందును "చింతనశక్తి" ఉండేవారు వుండరు. చరిత్ర అంతా వెతుకుతే శ్రీకృష్ణుడు - జనకుడు తప్ప మూటియందును చింతనశక్తి గలవారు ఇక లేరనుట స్పష్టము.

ధర్మప్రబోధము కొరకు అప్పుడప్పుడు శంకరుడు, బుద్ధుడు, రామానుజుడు, క్రయిస్తు, మహమ్మదు, గాంధి మహాత్ముడు

వంటివారలు రెండు చింతనల శక్తితో పుట్టుచుండుట చరిత్రాత్మకము. వీరిలో మనోచింతనతో కూడిన మరొక చింతనగలవారలు జ్ఞాన సిద్ధాంతము మీదను, మనోచింతన లేకుండా తదితర రెండు చింతనలు గలవారు ప్రేమ - భక్తి సిద్ధాంతములమీదను వారి వారి ప్రబోధములు జరుపుచుండెదరు.

ఒకే చింతనగల సామాన్య మానవులు అప్రబోధములయొక్క మూల సిద్ధాంతములు గుర్తింపజాలక పార్టీలు పెంచుకొని కలహములు పెంచుకొనుటకూడా తరచుగా జరుగుచుండును. ఈ వరుసలో మనోచింతనతో చేయువారి అన్వయము ఇతర చింతన గలవారికి విరుద్ధంగాను, ఇట్లే ఇతర చింతనగల వారి నడక మరొక చింతనగలవారికి వరుద్ధంగాను తోచుచుండును.

అందుకని యే ప్రభుత్వ నిర్వహణ సందర్భమందైనను యే వివాద సందర్భమునందైనను అయిదుగురితో కూడిన పంచాయితీ నిర్ణయము ఒడుదుడుకులు లేనిదగా ఎంచబడుచున్నది. ఈ అయిదుగురిలోను వివిధ చింతనశక్తులు గలవారు వుందురని నమ్మిక.

ఇట్టి ఉత్కృష్ట విధానములో పంచాయితీ సభ్యులుగా వుండుటకు తగినవారిని యేర్పరుచుకోవలసి యున్నది. ఇందుకు జీవిత అనుభవము రుజావుచేసినవారై యుండుట అవసరము. పెద్ద బాధ్యతలు నిర్వహించునపుడు నిర్గుణ శాస్త్ర ప్రావీణ్యము (Pledged to Non-possession) గలవారై యుండుట శ్రేయస్కరము. ఎవరైనను తమ జీవితములో 14 సంవత్సరములకుతక్కువకాని కాలము వారి దీక్షను ఋజావుపరచిన

వారికే పంచాయితీ సభ్యత కలుగజేయుట ఉత్తమమై ఉండును. ఈ పరిజ్ఞానము చరిత్రాధారములతో ఈడునుబట్టి తెలుసుకొనే పాఠ్య విధానములో యిమిడ్చి శిక్షణ పొందే వారికి నచ్చజెప్ప వలసి ఉంటుంది.

మానవుని ముప్పునుండి తప్పించగలిగేది 'శిక్షణ' తప్ప మరొకటి లేదు. శిక్షణ నిలయము వారి ప్రణాళికను అనుసరించి ప్రతివారికి వారి -

15 సం॥ల వయస్సు నిండేనాటికి - గ్రామస్వరాజ్య శిక్షణ
25 సం॥ వయస్సునిండేనాటికి - గ్రామ విశ్వవిద్యాలయ శిక్షణ యిచ్చి-
35 సం॥ల వయస్సునిండేనాటికి జీవితనడక ద్వారా 'యోగ్యుడు' అనే బిరుదు పొందుటకున్నూ,
55 సం॥ల వయస్సు నిండేనాటికి 'పూజ్య' తరగతిని చేరి సాధించుటకున్నూ
70 సం॥ల వయస్సు నాటికి మహాత్ముల గోష్ఠిలో చేరి జన్మరాహిత్యమును గురించి సాధించుటకున్నూ

పూనుకొనునట్లు ఉపదేశం చేయవలసియున్నది. ఇట్టి శిక్షణను ప్రజలు - ప్రభుత్వములు గుర్తించి అమలుజరుపుతే మారణ యంత్రములకు, ఆటంబాంబులకు అగుచున్న సైన్యపుఖర్చు చాలా తగ్గిపోగలదు అని పాఠ్య కార్యక్రమములో ఇమడ్చాలి. ఇందుకు పాఠ్య గ్రంథాలు వ్రాయించాలి.

# అహింస సేవాసంఘము

నిర్గుణ శాస్త్ర జ్ఞాన ప్రవీణత గలవారల (Pledged to Non-possession) కూటమికి యిది యేర్పాటు చేయును.

ఇందులో 14 సంవత్సరములు సాధికచేసినవారు కార్యకర్తల స్థానములోకి ప్రవేశించుదురు.

రంగు-జాతిమత-వర్ణ-విచక్షణ లేకుండా యిందు చేరవచ్చును. ప్రవేశవయస్సు 35 సంవత్సరములు ఉండాలి.

వీరు గ్రామస్వరాజ్య శిక్షణతోగాని, గ్రామ విశ్వవిద్యాలయంతో గాని, శిక్షణ నిలయంతోగాని—జీవిత సంబంధం కలిగి వుండుట అవసరం.

క్లిష్ట పరిస్థితులు వచ్చినప్పుడున్నూ, మూడు సంవత్సరములకు ఒకసారిన్ని యీ సంఘసమావేశం యేర్పాటు చేసి వీరి పరిచయం సంపాదించుట ఈ విశ్వవిద్యాలయమునకు అవసరము.

పాఠ్య గ్రంథములున్నూ ప్రభుత్వ శాసనములున్నూ వీరి పరిశీలనలో వుంచుతూ వీరి సలహాలు పొందుచుండుట మంచిది.

ధర్మ ప్రవర్తనకు ఆటంకం కలుగుచున్నప్పుడు వీరు జోక్యం చేసుకోవాలి.

# గ్రామ విశ్వవిద్యాలయము

## తీర్మానములు

గాంధివిలాస్, విజయవాడ,

ది 23 - 8 -1950

హాజరు :

1) బ్రహ్మాండం నరసింహం

2) ఉప్పులూరి వెంకటకృష్ణయ్య

3) బ్రహ్మాండం ఆంజనేయులు

1) "ఆంధ్రకేసరి" శ్రీ టంగుటూరి ప్రకాశం పంతులుగారి జన్మదినోత్సవ సందర్భమున సమావేశమై భక్తి పూర్వకముగా శ్రీ స్వామి సీతారాంగారి సమక్షమున చేసికొనిన తీర్మానములు :

మల్లాది సుబ్రహ్మణ్యంగారిని, ఆలూరి లక్ష్మీనారాయణగారిని ఈ కమిటీలో ఎన్నుకొని చేర్చుకొనడమైనది. ఈ 5గురి కమిటీయే ఈ విశ్వవిద్యాలయ కార్యసమితి (సిండికేటు)గా ఇకముందు నుండి వ్యవహరించుటకు తీర్మానమైనది.

**కార్యసమితి సభ్యులు**

1. బ్రహ్మాండం నరసింహంగారు,

2. ఉప్పులూరి వెంకటకృష్ణయ్యగారు

3. బ్రహ్మాండం ఆంజనేయులుగారు

4. ఆలూరి లక్ష్మీనారాయణగారు

5. మల్లాది సుబ్రహ్మణ్యంగారు

2) ఈ దిగువ నుదహరింపబడిన పెద్దలను ఈ గ్రామ విశ్వవిద్యాలయమునకు ఆప్త బృందముగా ఏర్పరుచు కొనడమైనది.

1. శ్రీయుత టంగుటూరు ప్రకాశం పంతులుగారు.

2. శ్రీయుత స్వామి సీతారాంగారు.

3. శ్రీయుత జే.సి. కుమారప్పగారు.

4. శ్రీయుత ఆర్యనాయకంగారు.

5. శ్రీయుత వినోబా భావేగారు.

వీరితో జరిగే సమావేశమును "సత్సాంగత్య సమావేశము" గా పరిగణింపబడును.

3) ఈ గ్రామ విశ్వవిద్యాలయమునకు శ్రీ ఆంధ్రకేసరి టంగుటూరి ప్రకాశంపంతులుగారు ఛాన్సెలరు (Chancellor) గా ఉండమని కోరుచూ ఏకగ్రీవముగా ఎన్నుకోవడమైనది.

4) ఈ గ్రామ విశ్వవిద్యాలయమునకు శ్రీ బ్రహ్మాండం నరసింహంగారిని వైస్ ఛాన్సెలరు (Vice Chancellor) గా ఏకగ్రీవముగా ఎన్నుకొనడమైనది.

5) ఈ విశ్వవిద్యాలయము యొక్క కార్యక్రమము జయప్రదముగా నడిపించుటకుగాను 750 (ఏడు వందలేబది) బస్తాల

ధాన్యము పెట్టుబడితో ధాన్యం బ్యాంకున్నూ 7500 (ఏడువేల అయిదు వందలు) నూలు చిలపలతో బ్యాంకున్నూ ఏర్పరచుటకు తీర్మానించటమయినది. ధాన్యం బ్యాంకు తాలూకు 150 బస్తాలు జోగన్నపాలెంలోను, 150 బస్తాలు మర్రిపూడిలోను, 150 బస్తాలు గుణదల ఖద్దరు సంస్థానములోను, 150 బస్తాలు విజయవాడ గాంధివిలాసంలోను, 150 బస్తాలు శోధన్ తెనాలి వారి గృహంలోను, నిలువ చేయుటకున్నూ, గ్రామ విశ్వవిద్యాలయ అవసరములకు వినియోగించు కొనుటకున్నూ తీర్మానించటమైనది. శాఖ 1 కి అయిదు బస్తాలచొప్పున ఇప్పుడే పెట్టుబడిగా యుంఇ ధాన్యం బ్యాంకు ప్రారంబించడమైనది. ఏడువందల ఏభై విచ్చెల వడుకునూలు విచ్చెల పెట్టుబడితో నూలు బ్యాంకును స్థాపించడమైనది. నూలుబ్యాంకు విజయవాడ ఖద్దరు సంస్థానం గాంధివిలాస్‌లో స్థాపించడమైనది.

6) గ్రామ విశ్వవిద్యాలయ శిక్షణ కేంద్రములు ఈ దిగువ నుదహరించిన స్థానములలో స్థాపించి నడిపించుటకు తీర్మానించడమయినది.

1. గుణదల ఖద్దరు సంస్థానము,
2. గ్రామస్వరాజ్య పీఠము - జోగన్నపాలెము,
3. శోధన్ కార్యాలయము - తెనాలి
4. మర్రిపూడి.
5. విజయవాడ.

7) వైసు ఛాన్సెలరుగారి (Vice - Chancellor) తో గ్రామ విశ్వవిద్యాలయ ఆఫీసు వుంచుటకు తీర్మానించడమయినది.

8) ఈ విశ్వ విద్యాలయము యొక్క ఆదర్శములతోను, నిబంధనలతోను, చట్టముతోను, పూర్తిగా ఏకీభవించిన సంస్థలను, కుటుంబములను యిందులో చేర్చుకొనుటకు తీర్మానించడ మయినది.

9) గ్రామ విశ్వవిద్యాలయమునకు శ్రీ ఉప్పులూరి వెంకటకృష్ణయ్య గారు తయారు చేసిన చట్టమును చిత్తుగా తీసుకొని దానిని అచ్చొత్తించి పండితాభిప్రాయమునకు పంపి అభిప్రాయములు సేకరించినమీదట వివరములు చర్చించి సరిదిద్ది అంగీకరించుటకు తీర్మానించట మయినది.

10) ఈ విశ్వవిద్యాలయపు ఆధ్వర్యము క్రింద వయోజనవిద్య వ్యాపాకార్థముగా నైతిక, ఆర్థిక, సాంఘిక, రాజకీయములను ప్రబోధించుటకు సందర్భానుసారముగా అవసరమయినప్పుడు 40 మందికి మించకుండా తాత్కాలిక తరగతులను యేర్పాటు చేయించి ప్రముఖలవలన విజ్ఞాన ప్రబోధము చేయించు చుండుటకు తీర్మానించడమయినది.

11) "గ్రామస్వరాజ్యమ్" పత్రిక గ్రామస్వరాజ్య పీఠం యాజమాన్యాన నడుస్తుంది. ఈ పత్రిక గ్రామ విశ్వవిద్యాలయ

గంభీరవాణిగా వెలువడుతుంది. సంపాదకులు : శ్రీ ఆంధ్రకేసరి టంగుటూరి ప్రకాశంపంతులుగారు సంపాదన బృందము : అనగా సహాయ సంపాదకులు 1) శ్రీ ఉప్పులూరి వెంకటకృష్ణయ్యగారు, 2) శ్రీ ఆలూరి లక్ష్మీనారాయణగారు, 3) శ్రీ బ్రహ్మాండం ఆంజనేయులుగారు, 4) శ్రీ వేగిరాజు కృష్ణంరాజుగారు, 5) శ్రీయెర్నేని సుబ్రహ్మణ్యంగారు. వీరే ప్రచురణ సంఘంగా ఉండవలెను.

పత్రికయొక్క ఆర్థిక బాధ్యత వెయ్యి పత్రికల వరకు సంపాదక బృందమువారు సమాన బాధ్యతతో వహింతురు. ఆపై బడిన స్థితికి అనగా వెయ్యికి మించిన చందాదార్లు భర్తీ కాగానే గ్రామస్వరాజ్య పీఠము జోగన్నపాలెం ఈ పత్రిక యొక్క ఆర్థిక నిర్వహణ బాధ్యతలను వహిస్తుంది., ఈ పత్రికను గ్రామ స్వరాజ్య ప్రెస్సులో గ్రామ స్వరాజ్య పీఠమువారిచే ప్రచురించుటకు తీర్మానించడమైనది.

12) ఈ విశ్వవిద్యాలయమునకు విద్యార్థులు, సిబ్బంది ఉపకార వేతనములు నిర్ణయించి యేర్పాటు చేసిన కార్యక్రమమును నడిపించుటకు వైస్ ఛాన్సెలరు గారికి అధికార మివ్వడమైనది.

13) విశ్వవిద్యాలయం తరపున కావలసిన రొఖ్ఖమును చందాల రూపమునగాని, ఋణ రూపమునగాని తీర్మానమునకు లోబడి తెచ్చుటకును, ఆ సొమ్ము రొఖ్ఖపు బ్యాంకులలో వుంచి క్రమమైన లెక్కలు వ్రాసి తీర్మానమునకు లోబడి ఖర్చు పెట్టుటకున్నూ వైస్ ఛాన్సెలరుగారికి అధికార మివ్వడమైనది.

14) వస్తుమార్పిడి విధానమును ప్రత్యక్షముగా అమలు జరుపుటకును, అందుకు అవుసరమయిన హుండీలు, భోజనపు చీట్లు, స్వార్జితపు టిక్కెట్లు విశ్వవిద్యాలయము తరపున యేర్పాటు చేయుటకునూ, వీటిని స్వయంపోషకపు పద్ధతిన చలామణీ చేయుట కునూ, అవుసరమైన టిక్కెట్లు, రశీదు పుస్తకములు, చెక్కు పుస్తకములు, తదితర స్టేషనరీ సమకూర్చుకొనుటకున్నూ, వైస్ ఛాన్సెలర్ గారికి అధికార మివ్వడమైనది. ప్రభుత్వము వారితోను, బయటివారి తోను ఉత్తర ప్రత్యుత్తరములు జరుపుటకు వ్యవహరించుట కున్ను, మాతృభాషలోను, హిందీలోను మాత్రమే వ్యవహరించుటకున్నూ తీర్మానించడమైనది.

15) ఆర్థిక వనర్లు : ఈ దిగువ ఆర్థిక వనర్లు ఈ విశ్వవిద్యాలయమునకు కల్పించడమైనది.

1. తెనాలి : శ్రీ బ్రహ్మాండం నరసింహంగారి తాలూకు (1) తెనాలిలోని శోధన్ గృహము 2) పెయింటు పరిశ్రమ మీద రాదగిన ఆదాయము (3) శ్రీ బ్రహ్మాండం ఆంజనేయులుగారి తాలూకు తెనాలి శోధన్ గృహములోని పారిశ్రామిక గ్రంధాలయము, పరిశోధనాలయపు వనరు, (4) వీరి తాలూకు అచ్చు సిరా, సబ్బు, వ్రాత సిరా పరిశ్రమలలోని విద్యార్థులందరి తరిఫీయతు - ఆదాయపు వనర్లు.

2. మర్రిపూడి : మర్రిపూడిలోని (1) శ్రీ బ్రహ్మాండం ఆంజనేయులుగారి తల్లిగారయిన పున్నమ్మగారి తాలూకు భవనము (2) శ్రీమతి పున్నమ్మగారి తాలూకు య. 4 రాలు డెల్టా పల్లంమీద వచ్చే ఆదాయం.

3. గుణదల : ఖద్దరు సంస్థానం వారి గుణదల గ్రామంలోని వారి వాటా ఆదాయపు వనరు - వ్యవసాయపు వనరు - శిక్షణ వనరులు కుటీరపు వనరులు -

4. విజయవాడ : గాంధీవిలాస్ భవనము - గ్రామస్వరాజ్య ప్రెస్ వనరు - స్టోర్సు వనరు -

5. జోగన్నపాలెం : గ్రామస్వరాజ్య పీఠమువారి గ్రంథమాల (2) ప్రెస్ షేరు (3) య 7 - 20 శెంట్లు మామూలు అప్లాండు పల్లం భూమి (4)జోగన్నపాలెం శ్రీరామమారుతీ సేవా సంఘము వారి తీర్మానము ప్రకారం షుమారు య10-0 లు మామూలు అప్లాండు పల్లం భూములమీద వచ్చే వనరు - (5) దేవాలయ సేవ (6) గ్రామస్థుల విరాళములు (7) గ్రామస్వరాజ్య పీఠం వారి 2000 గజముల నివేశ స్థలం, భవనములు, కుటీరములు -

16) విశ్వవిద్యాలయము క్రింద పనిచేయు యావత్కాల సిబ్బంది, తాత్కాలిక సంబంధముకలవారు, నౌకర్లు, పాలిదార్లు, విద్యార్థులు, వేతనములు, స్టయిపెండ్లు, ఇయతర సాజర్లు మొదలైన వివరములతో కూడిన ఎష్టాబ్లిష్మెంటు రిజిష్టరున్నూ, వారివల్ల -రాబట్టే కృషి వివరములున్నూ, ఆస్తులపై మేనేజిమెంటు, ప్రస్తుతస్థితి గతులున్నూ, పశు ధనస్థితిగతులున్నూ, తెలుసుకొని ముందు అభివృద్ధికి మార్గములను సూచిస్తూ వున్నదానిని సక్రమముగా నడుపుతూ యుండు లాగున నివేదికను తయారు చేయగలందులకు వైస్‌చాన్సెలరు గారికి అధికార మిస్తూ తీర్మానించడ మయినది.

---

గ్రామ విశ్వ విద్యాలయ పరిశోధనాలయములో
తయారు కాబడిన అచ్చుసిరాతో
ఖద్దరు సంస్థానం - గాంధివిలాస్‌లోని గ్రామ స్వరాజ్య
ప్రెస్సు - విజయవాడ - 2 లో ముద్రితము

# అహింస సేవాసంఘము

## జోగన్నపాలెం : పశ్చిగోదావరిజిల్లా

గ్రంధమాల ప్రచురణలు : ఇవి వికేంద్రీకరణ విధాన నడకను బోధించును.

| | | రు | అ | పై |
|---|---|---|---|---|
| 1. | గ్రామతత్వం (తెనుగు)<br>వికేంద్రీకరణ శాస్త్రము - రచయిత :<br>శ్రీ ఉప్పులూరి వెంకటకృష్ణయ్యగారు | 0 | 8 | 0 |
| 2. | ఇన్ప్లేషన్ (తెనుగు) మొదటిభాగం<br>ద్రవ్య ప్రమాదము - రచయిత డిటో | 0 | 2 | 0 |
| 3. | ఇన్ప్లేషన్ (ఇంగ్లీషు) రెండవభ్గగం<br>శ్రీ ప్రకాశం - గాంధిగార్ల ఉత్తర ప్రత్యుత్తరాలు | 0 | 4 | 0 |
| 4. | ఇన్ప్లేషన్ (ఇంగ్లీషు) మూడవభాగం<br>నాణె విధానముమీద శ్రీ ప్రకాశంగారి వ్యాసాలు | 0 | 4 | 0 |
| 5. | ఇన్ప్లేషన్ (ఇంగ్లీషు) నాల్గవభాగం<br>వస్తుమార్పిడిని గురించి పండిట్ జవహర్లాల్ నెహ్రూ,<br>ఆంధ్రకేసరి టి. ప్రకాశం పంతులుగారు పరిశీలించిన ప్రణాళిక | 0 | 8 | 0 |
| 6. | ఇన్ప్లేషన్ (ఇంగ్లీషు) అయిదవ భాగం<br>భారతదేశ భావి అభివృద్ధికి శ్రీ టి. ప్రకాశం పంతులుగారు<br>పరిశీలించివ ప్రణాళిక | 0 | 8 | 0 |
| 7. | ఖద్దరు సంస్థానం - గాంధిమహాత్ముడు (ఇంగ్లీషు)<br>25 సంవత్సరముల పరిశోధన. | 1 | 0 | 0 |

షరా : గ్రంధములు - తర్జుమాలు ప్రకటించబడును. గ్రామస్వరాజ్య పత్రిక చూస్తుంటే వివరములు తెలుస్తుండును.

వలయువారు : గ్రామస్వరాజ్య ప్రెస్, బకింగ్హామ్ పేట, విజయవాడ -2, లేక గ్రామ విశ్వవిద్యాలయ కేంద్రములకు వ్రాయవలయును.